చారిత్రకసమితి ప్రచురణము - ౧.

# శ్రీకృష్ణుఁడు

(ఐతిహాసిక చరిత్ర)

కర్త:

జయంతి వేంకట జగన్నాథరావు.

FOR COPIES APPLY TO:—

**D. V. KRISHNA RAO,**
**Gadevari St.**
**BERHAMPUR (Ganjam)**

# మనవిమాట

కళాప్రచారక సమితివారు ప్రచురించుచున్న యీ నూతన గ్రంథము వాఙ్మయప్రదర్శనశాలలో నొక విశిష్టస్థానము నాక్రమించుచున్నది.

దీనిని రచించిన శ్రీయుత జయంతి వేంకట జగన్నాథ రావుగారు నూతన విధమున సారస్వత సేవచేయుచున్న వారిలో నొకరు. బహుకాలమునుండి వీరు ప్రాచీన చరిత్ర పరిశోధనమున శ్రమపడుచున్నవారు. వీరిసిద్ధాంతము లపూర్వ ములై, యమూల్యములై యున్నవి. అశోకుని చరిత్రమున వీరు కనిపెట్టిన క్రొత్త సంగతులఁజేర్చి వీరు రచించిన "కార వాకి" యను నాటకము, చరిత్రనాటకరచనలలో విచిత్ర సమ్మేళనము కలిగి, యద్భుతముగా నున్నది. దీనిని మున్ముందు కళాప్రచారక సమితివారే ప్రచురింతురు.

ఇప్పుడు ప్రచురించుచున్న యీ "శ్రీకృష్ణుఁడు" శ్రీ జగన్నాధరావుగారి బహుకాల పరిశోధనలకు ఫలితమై యున్నది.

వాఙ్మయ ప్రపంచమున శ్రీకృష్ణుని స్థానము వర్ణనా తీతము. ఒకవంక, శ్రీకృష్ణుఁడు పరమేశ్వరుని దివ్యావతారమని భక్తులు పూజించుచుండ, వేఱొకవంక, శ్రీకృష్ణునివంటి దురాత్ముఁడు లేడని యాతని విరోధులు నిందించుచున్నారు. మతస్థాపకులగు క్రీస్తు మొదలగువారికిని, రాజ్యస్థాపకులగు నెపోలియన్ మొదలగువారికిని, ఇట్టి నిందాస్తుతులుకలసియేయున్నవి. కాని, శ్రీకృష్ణునియందు సామాన్య మనుష్యబుద్ధి కందని మహో విషయములు కలవు.

శ్రీకృష్ణుఁడు యదువంశోద్ధరణకై యవతరించిన వీరుఁడు. భారతవర్షము నుద్ధరించుటకై యవతరించిన ప్రతిభాశాలి. ప్రపంచము నుద్ధరించుటకై యవతరించిన మహాత్ముఁడు. మనుష్యమాత్రుల నుద్ధరించుటకై యవతరించిన పరమేశ్వరుఁడు. మనలోఁబుట్టి, పెరిఁగి, మనతోనాడిపాడి, మనల నాపదలనుండి కాపాడి, మనయైక్యమును ప్రతీక్షించు చున్న వ్యక్తిని, వీరుఁడందుమా, ప్రతిభాశాలియందుమా, మహాత్ముఁడందుమా! పరమేశ్వరుఁడందుమా! ఏమియన్న నేమి?

శ్రీకృష్ణునియందలి యీ మహాత్త్వమును విమర్శించి, క్రొత్తయుక్తులతో క్రొత్తమార్గమున నీ గ్రంథము రచించి లోకమునకుసమర్పించిన శ్రీజగన్నాథరావుగారు ధన్యులు. వారి పుస్తకమును బ్రకటించిన కళాప్రచారక సమితివారు ధన్యతరులు. కాని, జగన్నాథరావుగారి రచనకును, కళాప్రచారక సమితి వారుపరిచురించుటకును దగిన యవకాశమిచ్చినయాంధ్రమహాశయులు ధన్యతములు.

ఆంధ్ర మహాశయులు తగినంత ప్రోత్సాహమిచ్చినచో, శ్రీజగన్నాథ రావుగారి యితర పరిశోధనలగూడ కళాప్రచారక సమితివారు ప్రచురింపఁగలరు.

బరంపురం, మండపాక పార్వతీశ్వరశాస్త్రి,

5—5—'34. అధ్యక్షుఁడు.

కళాప్రచారక సమితి—ప్రచురము 4.

# శ్రీకృష్ణుఁడు

[ పరిశోధక చరిత్ర ]

గ్రంథకర్త:

శ్రీయుత జయంతి వేంకట జగన్నాథరావు పంతులుగారు,

బి. యే., ఎల్. టి.

"నపోలియన్" "శ్రీహర్షుఁడు" "కారవాకి"

మొదలగు గ్రంథముల రచియించిన సుప్రసిద్ధపరిశోధకులు.

వెల రూ. 0-12-0

# కళా ప్రచారక సమితి

బరంపురం, (గంజాం)

వాఙ్మయాభివృద్ధికి కేవల ప్రాచీనపద్ధతులు యువజనుల యుత్సాహమునకు భంగము వాటిలజేయుచుండ, కేవల నవీనమార్గములు వారి యుత్సాహమును వ్యర్థముచేయుచున్నవి. అమితమైన బంధనము నేర్పరచిన ప్రాచీనపద్ధతుల వలనను, మితిలేని స్వేచ్ఛ నేర్పరచిన నవీనపద్ధతుల వలనను, భాషాభివృద్ధి నరికట్టుటయు, భాషను స్వేచ్ఛావిహార మొనర్ప నిచ్చుటయు, నను ముప్పులు వాటిలుచుండుట జూచి, వాఙ్మయాభివృద్ధికి అవసరమైనంత నిరంకుశముకాని స్వేచ్ఛయు, బంధన రూపముకాని బంధమునుకూడ, నిలిపి క్రమమైన మార్గమున లోకకళ్యాణమున కవసరమైన వాఙ్మయాభివృద్ధియు కళాప్రచారమును సేయుటే యీ కళాప్రచారక సమితివారి యుద్దేశము. ఇట్టి కార్యమున కనుకూలములగు గ్రంథములు లభించినపుడెల్లె నవి ప్రచురింపబడుచుండును.

దేవరాజు వేంకట కృష్ణారావు,
కార్యదర్శి.

బరంపురం,
20—5—1934.

# ARGUMENT.

India of to day is not what it was thousands of years ago. Constant contact with the materialistic cultures of the occident has rubbed off much of the blind credulity of the Indian youth. He is no longer prepared to accept the ancient heroes as Demi-Gods (Avatars). The ancient Bhusuras (Brahmins) of Aryavartha have made the then Prithvipathis (Kings) Na-Vishnus (Gods and Demi-Gods.)

Out of Eternity
This new day is born,
Into eternity
At night will return.

Behold it aforetime
No eyes ever did
So soon it for ever
From all eyes is hid.

Here hath been dawning
Another blue day;
Think, wilt thou let it
Slip useless away ?

*Carlyle.*

In this book the life and doings of the great Bhagavatha Hero—Sri Krishna—are described as that of a man among men. This reading may sound strange to many an orthodox Andhra brother, but I crave their indulgence for the bold venture. In the other vernaculars of our country such books are in existence, and they did their work well in moulding the characters of their youth. So, in the words of the poet (Mordaunt) I am prompted to

"Sound, sound the clarion, fill the fife !
To all the sensual world proclaim",

that Sri Krishna lived and died like a man.

If we agree to think with Longfellow that:

"Lives of great men all remind us
We can make our lives sublime
And departing leave behind us,
Foot prints on the sands of time",

and wish to be profitted by the life of Sri Krishna, we must disposses him of the supernatural cloaks in which he is shrouded by his votaries, and try to study him as one among us.

As Southwell says:—

"Few all they need, but none have all they wish,
Unmingled joys have to no man befall."

Krishna had not unmingled joys, and he failed to have all he wished. At the beginning of his carreer his clansmen–the Yedus–were divided and scattered. Kamsa's conduct was the cause of their disunion. He killed Kamsa and removed the capital of the Yedus from Mathura to the island of Dwaraka. He planned to build mighty Yedu Empire. For a time his clansmen became invincible both on land and sea. But all the craft of Krishna could not keep them together for ever. Wine, women and war, worked their destruction and Krishna failed to have all he wished.

"Times go by turns, and chances change by course,
From foul to fair, from better hap to worse",

*Southwell.*

proved true in the case of the Yedus. Balarama, the brother of Krishna, like a true Yedu hero, said at the time of his demise, in the words of the poet, Landor:—

"With folded arms I linger not
To call them back—'t were vain
In this or some other spot
I know they will shine again."

True to what he said the Vedus and Abhiras began to shine forth in Palestine and Egypt.

Krishna did not end his life like his brother, though he knew full well that,

'The glories of our blood and state
Are shadows, not substantial things'

*Shelley.*

and at last, when the shaft of the wildman carried away his toe he realised that,

'There is no armour against Fate,
Death lays his icy hand on Kings'

*Shelley.*

Thus,

'Though Gods they were, as men they died'.

*Beaumont.*

'The garlands wither on your brow,
Then boast no more your mighty deeds;
Only the actions of the just
Smell sweet and blossom in the dust.'

*Shielong.*

Krishna helped the virtuous Pandavas to power and saved the ancient Aryan religion from extincion at the hands of the inrushing foreign hordes.

The brilliant victories he gained over the Non-Aryan chieftains in the early part of his career, enabled him to win the loyalty of the seers and sages of Aryavartha. Even the proud Aryan chieftains did not grudge to give the laurels to him at Indrapastha Nagara.

Krishna took the time by the forelock and at once introduced many radical reforms both into the Church and the State. Soon he became the Prophet of the age. He was the first of the great prophets, who worked for the unification and the upliftment of the human race. His school of 'Bhakti' offers salvation to all without distinction of sex, colour or creed. It can best be said of him,

' Thy thrilling trump had roused the land,
When fraud or danger were at hand;
By thee, as by the beacon light,
Our pilots had kept cours aright. '

*Scott*.

The philosophy he preached on the field of Kurukshetra was the beacon light which guided the latter prophets both of the East and the West. This immortal song of Krishna can best be summarised in the words of Longfellow thus:—

' Life is real ! Life is earnest !
And the grave is not its goal.
Dust thou art, to dust returnest,
Was not spoken of the soul.

Not enjoyment, and not sorrow,
Is our destined end or way;
But to act, that each to-morrow.
Finds us farther than to to-day.

Trust no Future, however pleasant,
Let the dead past bury its dead.
Act—act in the living present !
Heart within, and God o' erhead. "

In this book I have tried to paint the picture of Krishna as a man in the very words of our ancient poets. Only here and there I am obliged to read between the lines to make matters clear. Poets like Nannaya, Thikkana, Yerrapraggada, Somana and Surana did not carry him away to the unapproachable heavens. Suffice it to say that they did not put Krishna far and above the ills to which a mortal coil is heir to. But in this book I tried to avoid the undesirable and give prominence to the radiant features of his life, so that he may serve as an ideal hero to the youth of this twentieth century.

*THE AUTHOR.*

# విషయానుక్రమణిక



——:)o(:——

# భూమిక

1. హిందూదేశమందు కోట్లకొలదిజనులు భగవంతుం డని భావించుచున్న శ్రీకృష్ణుని జీవితమే మిథ్య యని కొందఱు బుద్ధిమంతులు వాదింప మొదలుపెట్టినారు. వాల్మీకి విరచితమగు రామాయణమును, వ్యాసవిరచితమగుభారతమును ఎందాక నిలచియుండు నందాక శ్రీరామకృష్ణుల నామములును స్మరింపఁబడు మనే యుండును. సర్వజన స్తవనీయుఁడైనవాఁడు తప్పక మహాత్ముఁడే యగును. ఆధునిక ప్రమాణములతో శ్రీకృష్ణుని జీవితచరిత్ర మీాచిన్నపుస్తకమున విమర్శింపఁబ్రయత్నించితిమి. నేఁడు మనము మహాపురుషులని, మహాత్ములని దేవదూతలని, ధర్మఘోషులని, మహావీరులని, యెంచిపూజించుచున్న మృతజీవులగు వారిలో నేరికిని శ్రీకృష్ణుఁడు తీసిపోఁడు.

2. వేదమతము, ఏకేశ్వరోపాసనము, ఉపనిషన్మతము, మధ్యదేశమునం దభివృద్ధి చెందెను. హాస్తినాపురప్రాంతమే మధ్యదేశము. భాగవతమత మనునది పూర్వ దక్షిణ పశ్చిమ భాగములందు క్షత్రియనాయకులచే నెలకొల్పఁబడి బ్రాహ్మణుల యామోదమునడయనారంభించెను. భాగవతధర్మము, జనకుఁడు జయవలి, అజాతశత్రుఁడు, అశ్వపతి, మొదలగు రాజన్యులచే ప్రథమమున పరిబోధింపఁబడి వాసుదేవునిచే నయ్యది సర్వ జనాదరణము వడయునట్లు సంస్కరింపఁబడినదని చెప్పనగును.

3. భాగవతమతోద్ధారకుఁడు కృష్ణవాసుదేవుండను క్షత్రియుండు. ఈతనితండ్రి వసుదేవుండు. తల్లి దేవకి. ఆంగిరసుఁడగు ఘోరుఁడను మహామునివలన కృష్ణుఁడు జ్ఞానోపదేశ మొందినట్లు ఛాందోగ్యోపనిషత్తు చెప్పుచున్న ది. ఈ వాసుదేవుఁడు విదేశజాతియైన యాదవులందరి తత్వత

శాఖకుఁ జెందిన వాఁడనికూడ చెప్పఁబడియున్నది. పరమాత్మ అనంతమనియును, శాశ్వతమనియుని, దయాపూరితమనియును, ముక్తియన శాశ్వతమైన ఆనంద మనుభవించుటయే యనియును బోధించిన మహాత్ముఁడే వాసుదేవుఁడు. *మహాభారతకథ యథార్థముకాకపోవచ్చునేమో కాని శ్రీకృష్ణుఁడను మహాపురుషుఁడుండుట మాత్రము కల్లకాదు. శ్రీకృష్ణుఁ డుండియుండుటయే సత్యమైనచో మహాభారతగాధయు కల్పనముకానేరదు. అట్లగుట నీ రెండింటి అన్యోన్యసంబంధమును విడదీయరానిదైయున్నది.

4. గౌతమబుద్ధుని మతము సర్వజనాదరణము వడయుటయు, బుద్ధదేవునిపూర్వజన్మగాధలు జనసామాన్యము నాకర్షించుచుండుటయుఁగాంచి, బ్రాహ్మణులు వేదమతమునకు భంగ పాటొదవుననియెంచి, జాతక కథల ననుసరించి, అవతారముల సృష్టించిరను సిద్ధాంత మొకటికలదు. "బౌద్ధమతమునకు గౌతముఁడెట్లు మూలస్కంధమయ్యెనో, అట్లే బ్రాహ్మణమతమునకు క్షత్రియవంశసంజాతుండగు శ్రీకృష్ణు నాధారముచేసికొని భాగవతమతమును బ్రాహ్మణులు సృష్టించిరి." అనుప్రతీతియుకలదు: అదియును కావచ్చును.

5. "మహాభారత కృష్ణుఁడు ఇతిహాసపురుషుఁడుకాడు:

---

* అట్లా కృష్ణుఁడు ఆంగిరసఘోరునికడ నొందిన జ్ఞానోపదేశమునకును, గీతలలోఁ గృష్ణుఁడుపదేశించిన జ్ఞానమునకును సంబంధము కానరానందున గీతోపదేశమొనర్చిన కృష్ణుఁ డాతఁడు కాఁడేమో తిలక మహాశయుఁడు తనగీతారహస్యమున వ్రాసియున్నాఁడు. భారత కృష్ణుఁడు వేఱు; భాగవత కృష్ణుఁడు వేఱు; అని రామకృష్ణభాండార్కరుగారు వ్రాసియున్నారు.

ఋగ్వేదములోని ఆంగీరసకృష్ణుఁడు, అసురకృష్ణుఁడు, ఛాందోగ్యములోని దేవకీనందన కృష్ణుఁడును, కలసి భారత కృష్ణుండయ్యెను. ఇట్లీసృష్టింపఁబడిన జీవచరిత్రయందు కాలక్రమమున ననేకగాథలు కల్పింపబడినవి.'' అని శ్రీపండిత సీతానాథ తత్వభూషణుఁడుగారు శ్రీకృష్ణునిగూర్చి వ్రాసియున్నారు. ఇదియును కావచ్చును.

6. అంశుమతీ నదీతీరమున పది వేలభటులవెంటఁబెట్టుకొని ఆర్యనాయకుండగు నింద్రు నెదిరించిన కృష్ణుఁడు ఋగ్వేదమున చెప్పబడియున్నాఁడు. అశ్వినీకుమారుల నారాధించుచుండిన కృష్ణుఁడు, వానికుమారుఁడు విశ్వకాయుఁడు, వేదములయందు పేర్కొనఁ బడియున్నారు. కృష్ణుఁడను ఋషి కొన్నిసూక్తముల నశ్వినీకుమారుల నుద్దేశించి చెప్పినటుల వేదములం దున్నది. ఈ బ్రాహ్మణ కృష్ణుని, ఆ క్షత్రియ కృష్ణుని ఏక మొనర్చి మహాభారత కృష్ణునిగ మనవారు నిర్మించిరను వాదమును కలదు. ఏవాద మెట్లున్నను, నిరవధికమగు కాలమునననుసరించి కథలుకూడ మార్పుచెందుచునే యున్నవనుట నిర్వివాదము. అంతమాత్రమున మూలపురుషుల చరిత్రలు మిథ్యయనుటకు వీలులేదు. మహాపురుషులజీవితములు మన నడవడికి దారిచూపు దీపముల వంటివి. అట్టి మహాపురుషుల నిజచరిత్రల మన మెఱుంగఁ బ్రియత్నించినచో, హిందూసంఘము నేఁడు ప్రపంచ మందగ్రస్థాన మాక్రమించి యుండవలసియున్నది. అట్లయ్యును అట్టి మహాత్ముల చర్యల సరియైన మానవదృష్టితో వీక్షింపక, ఆ మహాత్ము లవతారపురుషులనియు, భగవదంశ సంభూతులనియు నుత్ప్రేక్షించి వ్రాయుటచే అ పురుష సింహముల కీర్తికి కళంకము నాపాదించు దోషమును, ఆమహాత్ముల

నాదర్శప్రాయులుగ నెంచఁగూడని నష్టమును మనము పొందు చున్నాము. మనుజుడు తన శక్తియుక్తుల నెంతవర కుపయో గింపవలనుపడునో, మహాపురుషుల జీవితములు మనకు బోధించును. అట్టివారు భగవంతులేయని యనినచో, నెట్టి మానవునకైనను, ఆ మహాపురుషుల మార్గముల ననుసరించు టకు బుద్ధి వొడమునా? ధైర్యము కుదురునా? లోకమునకు మార్గదర్శకులుగ నుండఁ బ్రయత్నించిన మహాత్ముల నవతార పురుషులనుటచే, నా మహాపురుషుల ఆశయములకు విఘాతము కలిగించిన మహాపాతకముగూడ మనల నంటఁగలదేమో!

7. శ్రీకృష్ణునివంటి యుగకర్తను బట్టుచ లెభగవంతుండని, పొగడినంత మాత్రాన మనపాపము లన్నియు పోయి మనకు స్వర్గము చేకూరదు. మనుజుని శక్తిసామర్థ్యములు గుర్తెఱుంగ నిచ్ఛగింపని సోమరు లొనర్పవలసినపని యిది. సంఘాభివృద్ధియు, దేశాభివృద్ధియు గోరువా రట్లాచరింపరు. వీరాధివీరుల, రాజనీతిపరులలో నగ్రేసరుల, మనపూర్వులు దేవళ్లనొనర్చి, వారినాదర్శములుగ మన మొనర్పఁజాలకుండ మనల నిర్వీర్యులఁ జేసిరి. వీరపూజకిది మార్గముకాదు. వీరపూజలేని దేశము లభివృద్ధి చెందనేరవు; తమస్వాతంత్ర్యమును ఆత్మగౌరవమును, గాపాడుకొనఁజాలవు. కావున బ్రపంచమున నట్టి సంఘము నామమాత్రావశిష్టమగును.

8. ఈ చిన్న పుస్తకమున శ్రీకృష్ణుని జీవితము, చర్యలు, మాటలు, నాతని నెంతదూరము మన మాదర్శపురుషునిగ గైకొనందగునో అది చర్చింపఁబూనుట, యువకులకు ప్రయో జనకారిగ నుండవచ్చునని యాశింతుము.

---

# పూర్వగాథ

1. మానవసృష్టి క్రీస్తుకు పూర్వము 4004వ సంవత్సర మున ప్రారంభమైనది. అనగా నేటికి రమారమి ఆరువేల సం వత్సరములైనది. ఈశ్వరున కాసృష్టి రుచింపకుండుటచే నాతఁ డించుమించు నూరుసంవత్సరము లాలోచించి క్రీ॥పూ॥ 2349 (B. C. లో) మహాప్రళయము కల్పించెను. అం దనవసరము లైన ప్రదేశము లెన్నియో మునిగిపోయినవి. ఆనాఁడు పూర్వ సృష్టియెంతయో నాశన మొందెను. ద్రవిడ దేశాధీశుఁడైన సత్యవ్రతుఁడు మాత్ర మీశ్వరానుగ్రహమున హేమకూట మున (Pamir Plateau) కేగి ప్రాణముల దక్కించుకొన గలిగెను. ప్రళయానంతరము నామమాత్రావశిష్టమైన భూ భాగమునుండి దక్షిణ హిందూదేశము నిలచియుండెను. అం దుండిన ప్రజలు వరుణదేవు నారాధింప మొదలిడిరి. వీరి నే ఆర్యులు వేదములయందు పణులని పిలువఁ దొడఁగిరి.

2. సత్యవ్రతునితో హేమకూటమునకు వలసపోయిన ద్రవి డులు కాలక్రమమున నభివృద్ధిఁ జెంది 'ఆర్య' లను గౌరవ నామమున వ్యవహరింపఁబడఁజొచ్చిరి. వీరు మొదట సరస్వతి దృషద్వతీనదులకు మధ్యనుండు దేశమం దుండిరి. అద్దాని కి 'బ్రహ్మావర్త' మనిపేరు. ఇయ్యది దేవనిర్మిత దేశ మనికూడ

చెప్పుచుండిరి. కాలక్రమమున సత్యవ్రతుని సంతతివారు హేమకూటమునుండి దిగివచ్చి గంగాసింధునదులకు మధ్యనున్న ఉన్నతస్థలమందు నివాసము లేర్పరచుకొనిరి. ఆర్యులు తమ బుద్ధిబలముచే నీదేశమంతయు నాక్రమించి అభివృద్ధికి దెచ్చుటచే నయ్యది 'బ్రహ్మఋషిదేశ' మనిపేరొందఁ జొచ్చెను. ఆర్యులు మొదట ముఖ్యముగా నింద్రదేవు నారాధించుచుండిరి. కురుక్షేత్రము మత్స్యపాంచాల శూరసేనదేశము లీ బ్రహ్మఋషిదేశమందుండెను. ఇటుఁ బుట్టినవారే ప్రపంచమున నాచార్యపీఠమలంకరించుటకు అర్హత కలిగియుండిరి.

3. కాలక్రమమున నార్యులసంఖ్య యత్యధికమైన కొలది వారు క్రొత్తదేశము లాక్రమింపవలసిన యవసరము కలిగెను. సరస్వతీ నదినుండి ప్రయాగవఱకును నున్న దేశము 'మధ్యదేశము'గ నెన్నుకొని, ఆర్యు లన్నియెడలఁ బ్రాకఁ దొడఁగిరి. కొంతకాలమైనపిదప మధ్యధరాసముద్రమునుండి మహోదధి* వఱకును వ్యాపించియున్న దేశమంతయు నార్యావర్తమయ్యెను. కృష్ణసారము [లేడి] తిరుగు దేశమంతయు నార్యావర్తమని మనవారు సూత్రప్రాయముగఁ జెప్పఁదొడఁగిరి. ఇతర దేశములు మ్లేచ్ఛ దేశములట! ఇట నార్యులయందువలె చతుర్వర్ణ విభజనము లేకుండెను.

---

* Bay of Bengal.

4. జాతిభేదము లెట్లువచ్చెనో చూతము. మానవజాతి లోనున్న తెగలన్నిట నార్యులెక్కుడు మేధాశక్తి పొందియుండిరి. వారినివాసమున కేర్పఱచుకొనిన గంగాసింధుమైదాన మధికఫలవంతమైన ప్రదేశమగుట నార్యుల కెక్కుడు తీరిక యుండెను. అట్లా తీరికగల కాలమును వారు వ్యర్థపుచ్చక, తమభాష, భావములు, మతము, నభివృద్ధి పఱచుకొనుటకె వినియోగింప మొదలిడిరి. మానవజాతి ప్రారంభదశయందు వ్రాత కనిపెట్టఁబడకుండుట నప్పటి కార్యు లార్జించిన విద్యల మేధావంతులైన బాలురచే బఠియింపించి, యేతన్మార్గమున నిలువఁజేయుచుండిరి. అట్లగుట నార్యులార్జించిన జ్ఞానము నూర్జిత మొనర్చుటకు గొందఱిని ప్రత్యేకింప వలసివచ్చెను. ఈ బ్రహ్మజ్ఞాన నిధులే కాలక్రమమున బ్రాహ్మణులు అను ప్రత్యేక జాతిగ నేర్పడి ఆర్యసంఘమం దగ్రస్థానము నాక్రమింప మొదలిడిరి. మిగిలినవారు, బ్రహ్మజిజ్ఞాసాపరులగు వారి నెమ్మదికి భంగము రాకుండఁ గాపాడుచు, తమబుద్ధిబలముకన్న బాహుబలము నభివృద్ధి పఱచుకొనుచు క్షత్రియులైయుండిరి. ఇట్లే రెండు తెగలే తొలి నేర్పడియుండెను.

5. బ్రహ్మఋషి దేశమునుండి ఆర్యులు గంగానదీతీర భూములకే తెంచినంతనే వారు ఐహికసంపత్తులార్జించుటయం

దగ్గిగణ్యులైన యింకొకజాతితో తారసిల్లిరి. ఈ నూతన జాతికి సేద్యము, పశుపాలనము, వర్తకము ముఖ్యవృత్తులుగ నుండెను. ఈ దాక్షిణాత్య జాతులను ఆర్యులు పణులనియును, వైశ్యులనియును పేరిడి తమలో మూడవశాఖగ చేర్చుకొనిరి. పణులు బ్రహ్మక్షత్రియశాఖల అధికారమును మతమును అంగీకరించుటచే తమవృత్తుల తామునిర్విఘ్నముఁగ కొనసాగించుకొనగలిగిరి. ఈ నూతన ఆర్యవైదిక సమ్మేళనమువలన ఆర్యసంఘమునకు ప్రపంచచరిత్రయందు ఎక్కుఁడు ఔన్నత్యము ప్రాప్తించుటకు కారణమయ్యెను.

ఆర్యులు మధ్యదేశమువీడి ప్రక్కనున్న భూములకు వ్యాపించునంత నచ్చో అనాగరక సనాతనజాతులనుచూడవలసి వచ్చెను. ఈ జాతులవారు మానవసంఘమందు అతినికృష్ట దశయందుండుటచే వారిని ఆర్యులు తమలో చేర్చుకొనుటకు సమ్మతింపక వేరుగనుంచిరి. అగ్రవర్ణముల సేవించుచు కొంత కాలముండిన వీరికి ముక్తి ప్రాప్తించునని తలంచి 'దస్యు' లను నామమిడి ప్రత్యేకజాతిగ నేర్పఱచిరి. వీరేశూద్రులు. ఈ శూద్రులు అన్నిచోటులను స్థానిక వాసులని చెప్పనగును. ఆర్యుల యాజమాన్య మంగీకరింపక వేఱుగ నిలిచియున్న వారిని 'మ్లేచ్ఛ' లని పిలువదొడగిరి. మ్లేచ్ఛులే శూద్రులై కాల

క్రమమున సత్ప్రవర్తనవలన అగ్రవర్ణములకుఁగూడ నేఁగ ప్రాకుట కానాడు వీలుండెను.

7. ఇంక ఆర్యులు తమయధికారము నెట్లు వ్యాపింపఁజే యుచుండిరో చూతము. ఋషులని పిలువఁబడిన బ్రాహ్మణులు ఆర్యనివాసములకు దగ్గర నుండిన అడవులలో ఆశ్రమము లేర్పఱచుకొని నివసించుచుండిరి. వీరిబోధన లొకప్పుడు అచ్చోనుండిన అనార్యజాతుల కాగ్రహము జనింపఁజేసినచో ఋషుల కాపదలు ప్రాప్తించుచుండెను. ఆ పత్సముద్రమునందు మునిఁగియున్న ఋషిపుంగవుల నుద్ధరించుటకు క్షత్రియోత్తము లేతెంచి ఆటవికుల హింసించి వారి నార్యులకు దాసులుగ జేయుచుండిరి. మతముపేరిట మునులు కయ్యములు ప్రారంభించుటయు, ఖడ్గపాణులై వారిని సంరక్షించుటకు క్షత్రియు లేతెంచి అమాయికుల హింసించి వారి స్వతంత్రత కొల్లపుచ్చుటయు, నాఁటి ధర్మమైయుండెను. క్షత్రియ వీరులొనర్చిన మహోపకారమునకు కృతజ్ఞతా సూచకముగ ఋషులు తా మొనర్చెడి యాగాదులయందు హవిర్భాగము లార్యనాయకుల కర్పించుచుండిరి. వివిధ ఆర్యజాతులకు వివిధనాయకు లుండిరి. ఆర్యజాతి శాఖలన్నియు నేకమైన తరువాత ఎనమండ్రు నాయకులు మాత్రము మిగిలిరి. వీరలే దిక్పాలురను పేరున

హావిర్భాగములనందుకొన నాహ్వానింపఁబడుచుండిరి. వీరియందు పూర్వదిశకు సంరక్షకుఁడుగనుండిన ఇంద్రుఁడు ఈనాయకులకు నాయకుఁడయ్యెను.

8. ప్రాగ్దేశాధీశుఁడైన దేవేంద్రుఁడేల దేవతలరాజు కావలసి వచ్చెను? బ్రహ్మఋషి దేశము ఆర్యావర్త పుణ్యభూమిగ నభివృద్ధిజెందునపుడు ఆర్యులు తమకుఁ దూర్పుననున్న విదేశజాతులతో నెక్కుడుగఁబోరాడవలసివచ్చెను. మలయ ద్వీపము, బర్మాదేశము ప్రక్కనుండి నాగులను నొక నూతన జాతి ఆర్యావర్తమందుఁ బ్రవేశింప మొదలిడెను. వృత్రుఁడను వాఁడు వీరినాయకుఁడు. నాగులు నదీమార్గములఁబట్టి దేశములో ప్రవేశించి కొండలోయలలో కోటలుకట్టి నిలువఁదొడగిరి. ఈ వృత్రునకు 'అహి' యని కూడ పేరుండెను. ఇంద్రుఁడు తఱచు వృత్రునితోడను వాని యనుచరులతోడను ఆహవము లొనర్చుచుండెను. తుదకు విసుగొంది ఆర్యులు నాగులను తమలోఁ గలుపుకొనినట్లుకాన్పించును. ఈ త్రిజాతుల సమ్మేళనము-ఆర్య, ద్రవిడ, నాగజాతులసమ్మేళనము-కాశీక్షేత్రమందు జరిగెను. తచ్చూచకముగముూఁడుతో జులపండుగ నేఁటికినిహిందువు లందరునుపాటించుచున్నారు. అందలి (1) మొదటిదినము నాగుల దినముగుటచేనయ్యది 'భోగి'యనబడుచున్నది.(2) రెండవదినముక

(1) భోగి (2) సంక్రమణము (3) కనువు

ఆర్యులకు ప్రియమైన పితృపూజచేయుచున్నారు. (3)మహాదేవ దినమున పణులకు సంబంధించిన పశువుల పండుగ కావింతురు. ఇంక ఈకాశీక్షేత్రమందునాగభూషణుఁడు రాజు; మంత్రి *మహావిష్ణువు; క్షేత్రపాలకుఁడు అనార్యనాయకుఁడైన భైరవుఁడు. ‡

9. సర్వజాతి సమ్మేళనముగుటకు పూర్వము ఆర్యసంఘమందు రాజు లేకుండెను. అయ్యది నాయకప్రభుత్వముగ నుండెను. పణుల నాయకుఁడైన వరుణదేవునకుమాత్రము రాజను బిరుదముండెను. ద్రవిడులు ఆర్యసంఘమునందు ప్రవేశించిననాఁటినుండిఆర్యులయందు, రాజు-రాజ్యము అనునిబంధనలువచ్చెను. చాలకాలమువఱకు ఆర్యనాయకులు ద్రవిడనాయకుల అధికారమంగీకరింపనట్లు ఈశ్వరు (రుద్రు) నకును దక్షప్రజాపతికిని జరిగిన వివాదములవలన స్పష్టపడగలదు.

10. కొంతకాలమైన తరువాత ఆర్యులలో పాలిత, పాలక భేదములువచ్చెను. పాలకులుసురలనియును, పాలితులు నరులనియును పిలువఁబడఁజొచ్చిరి. చాలకాలమువఱకును నరులనతిదిగ్వ్రతులుగ నుండకూడదని సుర లాటంకపఱచుచుండిరి. నహుషుని కథయు త్రిశంకునికథయు నిందులకు ప్రబల నిదర్శన

(1) భోగి (2) సంక్రమణము (3) కనుమ

* ఆర్యక్షాత్రరక్షకుఁడు ‡ సునకరూపుఁడు—పశుపాలకుఁడు.

ములు. ఈసురలే దేవతలని మనవారు నేఁడుభావించుచున్నారు. పాలకులలో కొంత కాలమైన తరువాత భిన్నాభిప్రాయము లుద్భవించి వారు సురలనియును అసురులనియును రెండు శాఖలుగ చీలిపోయిరి. తొలుదొల్తఆర్యులు నరమాంసమును భక్షించుచుండిరి. యుద్ధమందు మృతినొందినవారియు, న్యాయాధికారులచే మరణదండనపొందిన నేరస్తులయుఁ గళేబరముల నందఱు నేకమై భుజించుచుండిరి. తినుబడి వస్తువులు అల్పముగ నుండినప్పుడు ఇట్టి దురాచారమున కెట్టి ఆటంకమును లేకుండెను. పణులు ఆర్యసంఘమందు ప్రవేశించి ఖాద్యపదార్థముల నధిక మొనర్చిన తరువాత నరమాంసభక్షణముఅనావశ్యకమయ్యెను. వ్యవసాయమును వాణిజ్యమును అభివృద్ధిజెందిన తరువాత నరబలి నికృష్టమని తోఁచెను. అందుచే యజ్ఞపశువుల నగ్నిలో దహనమొనర్ప మొదలిడిరి.

11. కొన్నికొన్ని తావులయందు పూర్వాచార పరాయణులు నరమాంసభక్షణము కొనసాగించుచుండుటచే ఆర్యసంఘమువారిని ఆర్యావర్తమునుండి అవ్వల కంపవలసివచ్చెను. వీరలే 'అసురు' లని పిలువఁబడదొడగిరి. ఈ అసురులు ఆర్యావర్త పరిసరములయందున్న ఆరణ్యభూముల కేతెంచి అనార్య జాతులతోఁగూడిసమయముచిక్కినపుడెల్ల ఆర్యుల నివాసముల పైఁబడి నాశన మొనర్చుచుండిరి. కాలక్రమమున భరతవర్ష

మందలి పూర్వదక్షిణభాగములు తత్ప్రాంతద్వీపములుఅసురుల కాటపట్టులయ్యెను. పిమ్మట ఆర్యు లనేకపర్యాయములు అసురులను భారతవర్షమునుండి అంపివేయుటకు ప్రయత్నించిరి. ఈసురాసురయుద్ధములు Ꞌమందరగిరిప్రాంతభూములందుజరుగుచుండెను. పణులనాయకుఁడైన వరుణదేవుని దండయాత్రవలన అసురులు దక్షిణహిందూదేశము వీడి యూఫ్రటీస్, *టైగ్రీస్ నదీతీరములకు వలసపోవలసివచ్చెను. అచ్చట వారు నెలకొల్పిన అసురరాజ్యమే పాశ్చాత్య పండితులచే అస్సీరియా (Assyria) సామ్రాజ్యమని తఱుచు వర్ణింపబడుచుండెను.

12. వరుణదేవునకు నీటిదారులు, నాటుదారులే కాక, ఆకాశమార్గములుకూడ కరతలామలకముగ తెలిసినట్లు ఋగ్వేదము చెప్పుచున్నది. పణులకు ఋతువులు, ఋతువర్షములు (Monsoons) కూడ బాగుగ తెలియును. క్షత్రియవీరులు ఆర్యుల అధికారమును నాటుదారులబట్టి అన్నియెడల వ్యాప్తమొందింప యత్నించుచుండ, పణులు నీటిమార్గముల దూరదేశములకేగి అచ్చో ఆర్యసంప్రదాయములను, నాగరికతను నెలకొల్పుచుండిరి. పాశ్చాత్యదేశములకు క్షత్రియులే తేరక పూర్వమే పణులుపడవలపైనేగి సముద్రాంతరభూములయందు వలస

Ꞌ మహేంద్రగిరి. * శరావతి.

రాజ్యముల స్థాపించి ఆయా దేశములతో వర్తకముచేయ మొద లిడిరి. చరిత్రల జాగ్రత్తగా పరిశోధించినచో ఆర్యావర్తమం దుండిన అన్నిశాఖల వణిజులును * పాశ్చాత్యదేశములయందు కూడ మనకు ప్రత్యక్షమగుదురు.

**13.** కొంతకాలమైన తరువాత ఆర్యసంఘమందు బ్రాహ్మణ క్షత్రియ వివాదములు ప్రబలుటచే ద్వీపాంతరభూముల కేగిన అసురులు విజృంభించి మరల భరతవర్షమున కాలిడ మొదలిడిరి. లంకయందు రాజ్యము చేయుచుండిన రావణుఁడు తన యనుచరులనంపి వింధ్యపర్వతములవఱకు తనయాజమాన్య ము వ్యాపింపజేసెను-అగస్త్య, విశ్వామిత్ర, గౌతమ కణ్వామహా మునులకు అసురులు బాధకలిగించుచుండుటచే అయోధ్యా ధీశుఁడైన శ్రీరాముఁడు దక్షిణాపథమున కేగవలసివచ్చెను.

---

| * West | East |
|---|---|
| The Phoenicians (Panis) | Vaniks or Vysyas. |
| The Cretans | Kiratas. |
| The Copts | Guptas. |
| The Carthegeinions | Sarthavahas |
| The Bedounis | Videhas |
| The Venniti | Vens |
| The Cannons | Karans. |
| etc., | etc., |

శ్రీరాముని నాఁటికి దిక్పతులగు సురలు పసదూలియుండుటచే వారు నరనాయకుఁడగు శ్రీరాముని వెనుకనుండి అసుర సంహారణమున కాతని ప్రోత్సహింపవలసివచ్చెను. తరువాత వారు ఆర్యసంఘమందు దూరి అనేకరాజ్యముల నేలుచుండిన రాజులను తమ పక్షమునకుఁద్రిప్పుకొన మొదలిడిరి. ఈయసుర సంప్రదాయానువర్తులగు రాజులనే శ్రీకృష్ణుఁడు హింసింపవలసి వచ్చెను-ఈ మహత్తరకార్య మాచరించుటకుగాను కృష్ణుఁడు ఇంద్ర, వరుణ పదవులందుండిన దేవతలచే ప్రార్థింపఁబడినట్లు పురాణములుకూడ చెప్పును—శ్రీకృష్ణుఁ డవతరించిన తరువాత ఆర్యావర్తమున అసురులు సంపూర్ణముగ అదృశ్యులైరని చెప్పనగును.

14. కాలక్రమమున సురలనువారుకూడ ఆర్యావర్తనాట్యరంగముననదృశ్యులైరి. త్రిశంకుఁడనునరనాయకునిమనుష్యశరీరముతో ఇంద్రలోకమునఁ గాలిడ వీలులేదని వాదించి, ముమ్మారాతనిఁదన్నితగిలివేయఁగా విశ్వామిత్రుఁడనుఋషిజోక్యముకలిగించుకొని త్రిశంకునికొఱకు వేఱుస్వర్గమునొకదానినినిర్మించి సురనరవివాదముల నానాఁ డంతతోనంత మొందించెను. ఆత్రిశంకునిపట్టియగు హరిశ్చంద్రుఁడు ఇంద్రాదిదేవతలకన్న నెక్కుడు వన్నెకెక్కిన సత్ప్రవర్తనకలిగి మనెను. హరిశ్చంద్రుఁ డార్జిం

చిన సత్కీర్తి తన్ను పదభ్రష్టునిఁ జేయునేమో యనుభీతిచే ఇంద్రుఁడాతని కర్ధాసనమిచ్చి సత్కరించెను. నహుషుని నాఁటికి దేవతల పొగరింకను సన్నగిలినది. దేవాసురయుద్ధముల యందు తఱచుగ దేవతలు దశరథుఁడు ముచికుందుఁడువంటి నర నాయకులసహాయము వేఁడుకొనుచుండిరి. నహుషుఁడు మానవ దేహముతోడనే, (అనగా చచ్చిమరలపుట్టకుండఁగనే) దేవేంద్ర పదవిని పొందఁగలిగెను. శ్రీరామునినాఁటికి దేవతలు సంపూర్ణ ముగ మూలఁబట్టిరి. నేఁటి ఆర్థికపు బ్రాహ్మణులట్లు ఋషులు క్రతువు లొనర్చునప్పుడుమాత్రము వారి ఆవశ్యకత కాన్పించు చుండెను. తాముచేయలేని కార్యము శ్రీరాముఁ డొనర్పగలిగి నందుకు, దేవతలు తమ కగౌరవము కలుగకుండ దశరథ తనయుఁడగు శ్రీరాముని మహావిష్ణునిఅవతార మని ప్రశంసింప మొదలిడిరి. ద్వాపరమునాఁటికి ఆర్యావర్తమున దిక్పతు లేలు చుండిన స్థలములే కాన్పింపకుండెను. ఇంద్రాది దేవతలు నామ మాత్రావశిష్టులై యుండుటచేతనే శ్రీకృష్ణుఁడు తండ్రిని ఇంద్ర యాగము చేయవలదనిచెప్పెను. అనవసరముగ వారికడ నుండిన పదార్థములను బ్రాహ్మణులకును పశువులకునుఉపయో గించిన నెక్కుడు ప్రస్తుతలాభ ముండునని కృష్ణుఁడు తండ్రికి బోధించెను. ఇంద్రుఁడలిగి ఆభీరుల శిక్షింపనరుదెంచెను గాని

గోవర్ధనగిరిగుహాలయుందు డాగియుండినవారిచెంతకు రా వెలుచి వెనుక కేగెను. జగత్కంటకముగ ప్రాగ్జ్యోతిష మేలుచుండిన నరకుని బాధపడలేక దేవేంద్రుఁడు శ్రీకృష్ణునికడ కేతెంచి పలికిన పలుకులఁ బరిశీలింతము.

"కం॥ నరకుండిటు ప్రత్యక్షపు
నరకంబునఁద్రోచె, నీవు నరసంతతికిన్
నరకచ్ఛేదనకరుఁడవు,
నరసఖ, కరుణింపఁదగు ననాథులమమ్మున్॥

చ॥ * * *
* * సం
గరమున మేము వానిభుజగర్వము సైఁపగలేక యిఁదులన్
సిరులఁ దొఱంగి వచ్చితిమి చెన్నటి మానవజాతి లోనికిన్॥

---

# యాదవుల పూర్వవృత్తాంతము.

1. నహుషుఁడు నరులలో జన్మించినను తన నిరుపమాన సత్ప్రవర్తనమువలన మహాఋషులను మెప్పించి దేవేంద్రపదవి పొందెను. అతని మనుమడైన యదుతనతండ్రియగు యయాతి యిచ్చినశాపమువలన నీచేర్పకుండుటచే రాజ్యభ్రష్టుఁడయ్యెను. యదు వంశీయులగు వృష్ణి భోజ మల్ల కుకుర అంధకులు కలకాలము ఆర్యావర్త పరిసరభూములంద్రిమ్మరి శంతనుచక్రవర్తి యనంతర మార్యావర్తమున విజృంభించి చిన్నచిన్న రాజ్యములనేర్పఱచు కొనిరి. వారిలో మాధవుఁడను భోజకుఁడు యమునానదీతీరమం దున్న మధురానగరమాక్రమించి ఆప్రాంతములకురాజయ్యెను. ఈతనిసోదరులగు ముచికుందాదులు వింధ్య, సహ్యాద్రి, మాల్య వంతము మొదలగు దక్షిణాపథ దుర్గమపర్వత రాజంబులందు దుర్గంబుల నిర్మించి అట దుర్జయులైరి. నర అసుర యదు పురు వంశీయులు ఉభయులును జాతుల సంకరమువలన కలిగినట్లు యయాతి మహారాజుచరిత్రమే చెప్పుచున్నది. వానిభార్యలలో దేవయాని దైత్యగురువగు శుక్రునికుమార్తెయనియును, శర్మిష్ఠ వృషపర్వుండను అసురరాజుకూతురనియు చెప్పబడియున్నది. యాదవులు యదువంశీయులు; యవనులు తుర్వసు సంతతి

వారు; భోజకులు వృహునకు పుట్టిరి. అణువువలన మ్లేచ్ఛులు కలిగిరి. తండ్రికి తన పుంసత్వము యిచ్చిన పురు వంశీయులే పౌరవ్యులు. ధృతరాష్ట్రుడు, పాండురాజు అనువారు పౌరవ్యులలోనివారు. ఋగ్వేదమునందు యదు, తుర్వసు లిద్దరును దస్యులైనట్లును, అనేకగోవుల నిచ్చి సమారాధనల నెరపి మనువును మంచిమాటలాడుటచే వారినాతఁ డార్యసంఘములో చేర్చుకొనినట్లును, చెప్పబడియున్నది. కావున వీరల సంతతివారగు యదు, వృష్ణి, భోజ, అంధక, కుకుర, మంద, కరూశ జాతులవారందరు ఆర్యావర్తపుణ్యభూమికావలనుండిన ద్రవిడజాతులవా రనియును, వీరు కొంతకాలము అసురవీరుల పాలన మందుండి తరువాత ఆర్యసంఘమందు ప్రవేశించి శ్రీకృష్ణునినాడు ఆర్యులలో ఐక్యమైనట్లును స్పష్టపడగలదు.

భారతమునుబట్టి యయాతి వంశీయులైన యాదవ జాతులకు రాజ్యపాలనాధికారము లేదు. యదు, వృష్ణి, భోజక, కుకుర, మల్ల మొదలగు తెగలవారందరును యదువంశీయులే. వీరందరు తొలుదొల్త ఆర్యావర్తమునకు పశ్చిమమున నుండిన దేశములలో సంచరించుచుండిరి. కాలక్రమమున ఆర్యావర్త భూములయందు ప్రవేశించి సింధునదీప్రాంత భూములందును, దక్షిణ హిందూదేశమందును, నివసింప మొదలిడిరి.

అందు భోజకులు యమునాతీరమందు మధురానగరము రాజధానిగా నొకరాజ్య మేర్పఱచుకొనిరి. సార్వభౌమపదము తొలగియుండిన యాదవులలో భోజకులకే తొలుదొల్త రాజ్య పాలనాధికారము కలిగెను. ∴ యాదవులపాలనకు లోబడిన అనార్యజాతి ఆభీరులు. వీరు శూద్రులుగను, యాదవులు క్షత్రియులుగను, ఆర్యులచే అంగీకరింపబడిరి. ఈయాదవులలో వృష్ణి వంశీయులు కొంతకాలమైనతరువాత అధికబలవంతులైరి. భోజకుల యింటి ఆడపడుచును పౌరవ్యులుసహితము వివాహ మాడి వారితో మైత్రి కావించుకొనిరి. కుంతిభోజుని కుమార్తె యగు కుంతీదేవిని పౌరవ్యుఁడగు పాండురాజు పెండ్లాడుటే యిందుకు నిదర్శనము కాదా! వసుదేవునికాలమున వృష్ణి వంశీయులు ఆర్యావర్తమం దధికబలవంతులుగ నుండుటచే నానాదేశపు క్షత్రియకుటుంబములాతనికి తమతమకన్యల నిచ్చి వసుదేవుని మైత్రి నభిలషించుచుండిరి. ఆహుకుని ఏడ్గురు కొమార్తెలను ఆహుకుని తమ్ముఁడగు ఉగ్రసేనుఁడు వసుదేవున కిచ్చి వివాహముగావించెను. అందు రోహిణియొకర్తుక. కోసల రాజు కన్యల నిరువురను, కాశీపతికూతురగు వైశాఖిని, వివాహ మాడెను. సృగాళుఁడు వసుదేవుని మైత్రినాసించి తనకన్యయగు సునామ్ని నాతనికి భార్యగ నొసంగెను. ఇంత యేల: యాదవ

వంశీయులలో మకుటధారులమని విఱ్ఱవీగుచున్న మధురాధి
నాధులగు భోజకులు సహితము తమకన్యల, దేవకి మొదలగు
ఏడ్గురను వసుదేవునకర్పించి ఆతనిసఖ్య మపేక్షించి యుండిరి.
వసుదేవుడు మధురకేతెంచునప్పుడు యువరాజగు కంసుడు
స్వయముగ రథమునడపి ఆతనిని గౌరవించెను. మధురాధిపతి
యగు ఉగ్రసేనుడు వసుదేవుని మైత్రివడసి యుండుటచేతనే
జరాసంధునిపక్షము చేర నిరాకరింప సాహసించెను.

## ఇంక ఆర్యావర్తమున పౌరవ్యుల అధికార మెటులుండెనో చూతము.

శంతను చక్రవర్తికాలమునాటివఱకు పౌరవ్యుల అధి
కారము ఆర్యావర్తమున నిరంకుశమైయుండెను. విచిత్రవీర్య
చిత్రాంగదుల శైశవంబున పౌరవ్య సామ్రాజ్యంబునంగల సామం
తులు స్వతంత్రింప మొదలిడిరి. మగధాధీశుడైన బృహ
ద్రథుడు పౌరవ్యుల అధికారము ధిక్కరించి స్వతంత్రించెను.
ఆతడు తన స్వతంత్రతను స్థిరపరచుకొననెంచి ప్రాగ్దక్షిణ
వాసులగు జాతులతో మైత్రిగావించుకొనెను. మగధరాజ్య
మునకు ప్రాక్ దక్షిణభాగంబులను బలిక్షేత్ర మందురు. అసుర
వంశీయుల అధికారము ప్రబలముగ నుండుటచే ఆతడు
ఆ మార్గముల ననుసరింపలసివచ్చెను. ఉత్తర పశ్చిమభాగమం

దుండిన పాంచాలురుకూడ స్వతంత్రించి సమ్రాట్టులగుటకు నువ్విళులూరుచుండిరి.

పౌరవ్యసామ్రాజ్య వ్యవహారముల చూచుచు నడిపించు చుండిన (Protector) భీష్ముఁడు సామ్రాజ్యాభిమానము గోరి బాలుఁడగు ధృతరాష్ట్రునకు గాంధార రాజకన్యను, పాండునకు ఆనాడు ఆర్యావర్తమందు బలవంతులుగ నున్న యదువంశ సంజాతయగు కుంతీదేవిని, మద్రపతి కూఁతురౌ మాద్రినింగూడ భార్యలుగ నొసర్చెను. పాండురాజు వయోవంతుఁడై రాజ్య భారము వహించిన తరువాత దిగ్విజయ మొనర్చి పౌరవ్యుల అధికారమును ఆర్యావర్తమందు అన్నియెడల వ్యాపింపజేసెను.

కాని పాండురాజు శాపదగ్ధుఁడై అకాలమృత్యువు వాతఁ బడుటచే జాత్యంధుండగు ధృతరాష్ట్రుఁడు సామ్రాజ్యవ్యవహార ములఁ జూడవలసి వచ్చెను. అప్పట్టున పౌరవ్యసామ్రాజ్య మందు మఱల అరాజకము తలచూప మొదలిడెను. పాంచాల పతి యగు ద్రుపదుఁడు స్వతంత్రించి ఆర్యావర్త సమ్రా ట్టగుటకు వేచియుండెను. మఱియు పాంచాలురు నిరంకుశులుగ నుండుటచే పౌగరెక్కట ద్దేశవాసులుగను, మిత్రులుగను నుండిన బ్రాహ్మణోత్తముల నగౌరవించుటచే ద్రోణ ప్రభృతులు

ద్రుపదుని వీడి వచ్చిరి. భీష్ముఁడు ద్రోణాదుల బలపౌరుషంబులు గుర్తెఱింగి వారినిసత్కరించి కురురాట్కుమారులకు యొజ్జలుగ నియోగించెను. ద్రోణాదులు పౌరవ్యుల అస్త్రవిద్యాపారంగతులుగ నొనర్చి వారిమూలమున పాంచాలపతిని పరిభవింపఁ జేసెను. నాటినుండియు ద్రుపదునకు పాండుసుతులపై ప్రేమయు గౌరవమును అధికమయ్యెను.

పౌరవ్యు లనుభవించుచుండిన ఆర్యావర్తసార్వభౌమతను నాల్గుమూలలనుండిన నాలుగు ముఖ్యజాతులవారాసించుచుండిరి.

1. మగధాధీశుఁడైన జరాసంధుఁడు.
2. పాంచాలపతియైన ద్రుపదుఁడు,
3. మత్స్యదేశాధీశుండగు విరటుఁడు.—
   (ఈతనికి సింహాబలుఁడు బానటయై యుండెను.)
4. మధుర నేలుచుండిన ఉగ్రసేనుఁడు—
   (వృష్ణివీరుఁడగు వసుదేవుఁడు తనకు వెనుదండిగా నుండునని ఉగ్రసేనుఁడు తలంచియుండును.)

మొదట ఆర్యావర్తము నాల్గు ముఖ్యభాగములుగ విభజింపబడియుండెను:—

(1) సప్తసింధు అనుపేరున సింధునది ముఖ్యముగ పారుచుండు దేశము పిలువబడుచుండెను.

(2) పంచనదము అను పేరున సింధునది యొక్క ఉప శాఖలు ప్రవహించుచుండు దేశము.

(3) సరస్వతి దృషద్వతీ నదుల మధ్య దేశమునకు బ్రహ్మావర్తమని పేరు. ఇందుండిన ఆర్యులు చుట్టు ప్రక్కలనున్న దేశముల నాక్రమించి అభివృద్ధి గాంచిన తరువాత ఆ దేశమంతయు మధ్య దేశ మని పేరొందెను.

(4) గంగానదికి దిగువనున్న మధ్యభాగము ముఖద్వార ప్రాంతభూములు ప్రాచీ (Praki) దేశమని పిలువ బడుచుండెను. గోగ్రా, గండకి, సోణభద్ర (హిరణ్యా భాగ) నదులు ప్రాచీదేశమందుండెను. గంగానద దక్షిణతీరమునుండి గోదావరీనదివఱకునున్న భూ భాగము అరణ్యామయమై 'దండక' అనునామమున పిలువబడుచుండెను.

కౌరవులును, పాండవులును నివసించిన దేశము కురు దేశము ముఖ్యనగరము హాస్తినాపురము. పాండవులు యమునానది పశ్చిమమున కేగి అచ్చో * ఇంద్రప్రస్థ నగరము నిర్మించుకొని నివసించుచుండిరి. కురు రాజ్యమునకు తూర్పున పాంచాల

---

* Indraprastha is medern Delhi-Kurushetra near Thaneswar.

ముండెను. అందు అహిచ్ఛత్రము, కన్యా[illegible]ము, కౌసంబి అను ముఖ్యనగరములుండెను. గంగా యము[illegible] గంగకు కొంతవఱకు తూర్పునను (1) పా[illegible]డెను. మత్స్య, శూరసేన దేశములు మధ్యదేశమున దక్షిణ పశ్చిమ భాగములం దుండెను.

మాగధులు మధ్యదేశమునుండి గంగానదీదక్షిణ భాగమున కేతెంచిరి. మహాభారత కాలమున అంగ, వంగ, పుండ్ర, కిరాట దేశములును, మత్స్యదేశమునందలి భాగమైన చేదిదేశముకూడ మాగధులకు సామంతులుగ నుండిరి. పాంచాలమునకు తూర్పున కోసల, అద్దానికి తూర్పున విదేహ దేశములు, గంగానది కుత్తరభాగమందుండెను. విదేహ దేశమునకు తూర్పున ప్రాగ్జ్యోతిషము, ఆపైన కామరూపమునున్నవి. కోసలులు కొందఱు వింధ్యపర్వత దక్షిణభూముల కేతెంచి, అచ్చో నొకరాజ్య మేర్పఱచుకొనిరి. అయ్యదియే దక్షిణ కోసల. పూర్వసముద్రతీరమునకు కళింగమని పేరు. పశ్చిమ తీరము ప్రభాసమని పిలువబడుచుండెను. పశ్చిమప్రాంతము లందు ద్వారకానగరమున శ్రీకృష్ణుడను బలవంతుడగు నాయకుడుండెను. సింధు దేశము[illegible]ను ఆ[illegible]వళి పర్వతపంక్తు లకును మధ్య సాళ్వదేశముండెను.

---

1 Kuru and Panchala occupied the North and East of Madhyadesa.

అనార్యులుగ నుండిన యాదవులు తమ సత్ప్రవర్తనము వలన ఆర్యులలో చేరినట్లును, కాలక్రమమున వారు తమ బలమధికము కావించుకొని స్వతంత్ర రాజ్యముల నేర్పఱచు కొనినట్లును, వసుదేవునినాడు యదువంశీయుల బలము అత్యధికమగుటచే ఆర్యావర్తమం దనేక రాజకుటుంబముల వారు యాదవులతో సంబంధబాంధవ్యములుకూడ చేయ మొదలిడినట్లు కాన్పించును. యాదవుల అభివృద్ధికి జరాసంధుఁడే ప్రబలవిరోధిగ నుండెను. అదిగాక పూర్వరాజవంశమైన పౌరవ్యుల బలము నానాటికిని సన్నగిలుచుండుటచే పాంచాల, మత్స్య, మాగధులు వారిని ధిక్కరింప ప్రారంభించుచుండిరి. వసుదేవుని కుమారుఁడగు శ్రీకృష్ణుఁడు యాదవు లభివృద్ధిఁజెందుటకు మత్స్య, పాంచాల, మాగధులను తొలుదొల్తఁ బౌరవ్యులకు లోబరుపవలెనని సంకల్పించుకొనెను. కావున పౌరవ్యులలో నొకశాఖయగు పాండవులకు పాంచాలురతోడను, మత్స్య దేశాధిపుఁడగు విరటునితోడను, బాంధవ్యము సంఘటిలుట శ్రీకృష్ణునకు ఆమోదదాయకమయ్యెను. శ్రీకృష్ణుఁడు మొదుట నిలిచి భీమునిచే జరాసంధుని చంపించి పాండవులను ఆర్యావర్తమున అధికబలవంతులఁజేసెను.

భారతవర్షమున ఆనాడు జరిగిన మహాయుద్ధమందు

యాదవులే రథికులై కార్యమూనినచో, ఆర్యనృపులెల్ల కలిసి, ఏకీభవించి యాదవుల రూపుమాపుదురన్న భీతి శ్రీకృష్ణున కుండుటచేత నేకావలయు పాండవులను ముందుంచి కురుక్షేత్ర రణరంగమున దా బ్రవేశించెను. కురుక్షేత్రయుద్ధానంతరము నిర్జీవమైన భారతవర్షమును పాండవులెంతో కాల మేలరని యును, అందుచే యాదవులు అనాయాసముగ ఆర్యావర్త మున నిరంకుశాధికారులు కావచ్చుననియును కృష్ణుడు తలంచి యుండవచ్చునేమో! కాని, యాదవవీరుల అవివేకకృత్యములే వారివినాశమునకు కారణములయ్యెను. యాదవులు నవనాగరికు లయందు తాండవించుచున్న ముఖ్యమైన *మూడు దురభ్యాస ములును, అలవరచికొని యుండిరి. వారు తమకాలమును నిరంతరము యుద్ధములయందును, వనితావినోదములయందును, సురాపానమందును, వృథసేయుచుండిరి. తుదకు కల్లుత్రాగి కైపెక్కి యాదవు లొకరి నొకరు గ్రుద్దుకొని చచ్చిరి.

పెరటిచెట్టు మందునకు పనికిరా దనునట్లు శ్రీకృష్ణుని బోధనలు యాదవులకు పథ్యముకాకుండెను. అందుచేతనే ఆతడు తనయందు భక్తివిశ్వాసములుంచిన పాండవుల అభి వృద్ధికే పాటుపడెను. యాదవులయందు దురభిప్రాయము

* Wine, Woman and War.

జనించుటచేతనే తనమూలబలమగు నారాయణగోపాలురను కూడ కురుక్షేత్రయుద్ధమందు శ్రీకృష్ణుఁడు రణదేవతకు బలియిచ్చెను.

ఉగ్రసేనుఁడేలిన మధురానగరము మొదట మాధవుఁడనువాఁడు నెలకొల్పి వివిధశాఖలయాదవుల కయ్యది పట్టుకొమ్మగాఁ జేసెను. మాధవుని వంశీయులైన భోజకులు రాజులైరి. వృష్ణి యిత్యాదిశాఖలవారు వారికి అనుచరులుగ నుండిరి. ఈభోజకులలోనివారు కొందరు వింధ్యపర్వత ప్రాంతములకేగి విదర్భకడ వేరొకరాజ్యమేర్పఱచుకొనిరి. కాల క్రమమున మధురానగరము యాదవవీరులకు ముఖ్యస్థానమై వన్నెకెక్కుటయేగాక పాంచాలురకును, పౌరవ్యులకునుగూడ పక్కలోని బల్లె మట్లుండెను.

---

# వసుదేవుఁడు

( ఆనకదుందుభి )

మధురయందును దక్షిణాపథభూములయందును యదువంశీయులు చిన్నచిన్న రాజ్యముల నెలకొల్పుకొని అభివృద్ధి జెందుచుండిరి. ఆర్యావర్తప్రాంతభూములందు నివసించిన జాతులయందు పాలితపాలకభేదములు మాత్రముండెను. వీరిలో పాలకులకు యాదవు లనియును, పాలితులకు అభీరులనియు పేరులు. అందుచేతనే యాదవులు క్షత్రియులుగను, అభీరులు శూద్రులుగను, ఆర్యులు గణించుచుండిరి. కొంతకాలమైన తరువాత ఈ యదువంశీయక్షత్రియులలో అనేకశాఖ లుద్భవిల్లెను. వారందరకును భోజకులు నాయకులుగ నుండిరి. కావున తొలుదొల్త భోజవంశమువారు రాజులై చరియింప ఇతర యాదవులుకింకరులై చరియించుచుండిరి. అందువృష్ణివంశమున వసుదేవుఁడనువాఁడుజన్మించి అధికబలవంతుఁడుగ నుండుటను మధురపతియైన ఉగ్రసేనుఁడు కీర్తిశేషుఁడును తనయన్నయును నగు ఆహుకునికూతునిచ్చి చెంతనుంచుకొనెను. వసుదేవుఁడు ఆర్యావర్తమందుండిన అనేక దేశముల రాజకన్యకల వివాహమాడి వారితో యాదవులకు సఖ్యము చేకూర్చెను.

ఆసురసంప్రదాయానువర్తియగు జరాసంధుఁడు మధుర నేలుచుండిన భోజకులను తన పక్షమునకు ద్రిప్పుకొనదలచి ఉగ్రసేనుని కుమారుఁడగు కంసునకు తనకూతులనిచ్చి వివా

హము కావించెను. కాని చార్వాకమత మవలంబించిన వారభివృద్ధిగాంచలే రని వసుదేవుఁడు బాగుగగుర్తెఱింగి యుండుటచే, జరాసంధకూటమున ఉగ్రసేనుని జేరకుండ జేసెను.

అంతట జరాసంధుఁడు తనఅల్లుఁడగు కంసుని జేరదీసి కానిమాటలాతనికి చెప్పెను. "వసుదేవుఁ డార్యావర్తమున అధిక ప్రఖ్యాతి నార్జించుచున్నాడు. మీతండ్రి ఆతనిచేతిలోని కీలుబొమ్మ. నేడో రేపో వసుదేవుఁడు మీతండ్రినిద్రోసి మధుర సింహాసన మాక్రమింపనున్నాడు. వసుదేవునిచేతమీతండ్రికో, కాకున్న వసుదేవునికి పుట్టనున్న కొమరునిచేత నీకో. మృత్యువునిశ్చయము – చేతులుకాలిన తరువాత ఆకులుపట్టిన లాభముండదు. కార్యము మీరకుండగనే కనులువిప్పుము – వసుదేవుఁడు పుత్రవంతుఁడైనంత నే ఆతనికిలోభము హెచ్చును. రాజ్యతృష్ణ జనించును. వసుదేవుఁ డేకాకిగ నున్నంత కాలము ఆతఁడు మీభోజకులను వినయవిధేయతలతో సేవింపవచ్చును."

జరాసంధుని మాటలు కంసునిమనంబు కలంచెను. అందుచే నాతఁడు వసుదేవుని దేవకీసమేతముగ కారాగృహబద్ధు నొనర్చెను. వసుదేవుఁ డధికబలవంతుఁడయ్యును యాదవుల క్షేమముగోరి చెరయందుండుటకు సమ్మతించెను. అంతియే కాదు; కంసునిభీతిబాపవసుదేవుఁడు తనకు దేవకియందుజన్మించు సంతానముకూడ కంసుఁడుఖండించుటకు తాను సమ్మతించెను.

క॥ పలికిన పలుకులు దిరుగక,

సొలయక వంచనము లేక సుతుల రిపులకుం
గలఁగక యిచ్చిన ధీరుం డిల
వసుదేవుండు దక్క నితరుఁడు గలడే॥

తదుపరి జరాసంధుఁడు తనయనుచరులగు రక్కసుల కంసుకడకంపి ఆతని దనుజమార్గానువర్తిఁగమార్చ మొదలిడెను. బాణ, భౌమ, మాగధ, మహాశన, కేశి, ధేనుక, బక, ప్రలంబ, తృణావర్త, చాణూర, ముష్టి కారిష్ట, ద్వివిధ, పూతనాది రక్కసులు మధుర కేతెంచుటచే, అనేకమంది యాదవులు, తమతమపదవుల విడిచి నిషధ, కురు, కోసల, విదేహా, విదర్భ, కేకయ, పాంచాల, సాల్వ దేశంబులు సొచ్చిరి. మచ్చరంబులు విడిచి కొందఱు మాత్రము కంసుని కొలిచియుండిరి. అందుచే యాదవబలంబు నానాటికి సన్నగిలఁ జొచ్చెను.

మాటదప్పక కన్నపుత్రులఁజంప కంసున కప్పగింపుచుండినను, ఆతఁడు తనక్రూరమార్గంబుల వీడకుండుటచే వసుదేవుఁడు కంసుని మోసగించి అంత మొందించినగాని, యాదవులకు సేమంబుఁ జేకూరదని నిశ్చయించి, దేవకి ఏడవచూలగు బలరాముని కంసునకీయక, దేవకిగర్భంబు విచ్ఛిన్నమైనదని బొంకెను. ఆబాలుని పెంప నాభీరనాయకుఁడగు నందునికడ కంపెను. తరువాత జన్మించిన బాలునికూడ నందునికడకు తానుస్వయముగ గొనిపోయి, అటనుండి ఒకస్త్రీశిశువును కొనివచ్చి యియ్యదియే దేవకి ఎనిమిదవ కాన్పని కంసునితో చెప్పెను. కంసుఁడా స్త్రీశిశువునే పట్టివధించెను.

ఈ దేవకి ఎనిమిదవచూలే మనకథానాయకుఁడగు శ్రీకృష్ణుఁడు. జరాసంధుని దుర్మంత్రంబున కంసుఁడు దేవకీవసుదేవుల కారాగృహమందుంచినంతమాత్రమున యదువంశ మంతరింపలేదు. వసుదేవుని సంకల్పము కడుదొడ్డది. ఆ కారాగృహమే జరాసంధాది దుష్టనృపుల మారణ మొనర్పజాలిన మహావీరు లుద్భవించుటకు కావలసిన వాతావరణ మొనగూర్చెను. ద్రోణునిచే పరాభవింపబడిన ద్రుపదుఁడు ఈసువీడి, ధృష్టద్యుమ్నుని బడసినటుల, అసురమార్గానువర్తులగు రాజుల కుతంత్రములచే చెరయందుండిన వసుదేవుఁడు ప్రార్థించి ప్రార్థించి అసుర సంహారణమునకు చాలిన యదుకిశోరమును శ్రీకృష్ణుని గావించెను. అట్లగుట నెకదా తలిదండ్రులపూజాఫలమే కొమరులై పుట్టుదు రందురు.

కంసుభీతిచే కృష్ణుఁడు కలకాలము అభీరశిబిరంబులనుండ వలసివచ్చెను. అందుచే అభీరులకు ఈతనియెడ అభిమానము మెండయ్యెను. చిన్ననాటనుండియు శ్రీకృష్ణుఁడు అభీరులమధ్య నాడుకొనుచుండుటచే వా రాతనికొఱకు ప్రాణములగూడ నర్పింప సంసిద్ధులైయుండిరి. శ్రీకృష్ణుని అభివృద్ధికి అభీరులే మొదట నధికముగ తోడ్పడిరి.*

---

* మాలవీలకు శివాజీపట్ల నట్టి ప్రేమభక్తులుండెను. కావుననే శ్రీ శివాజి ఛత్రపతి కాగలిగెను.

# శ్రీకృష్ణుని జననము-బాల్యము



అసురప్రేరితుఁడై కంసుఁడు ప్రజల ననేకవిధముల బాధించుచుండెను. కొంతకాలమునకు తనసోదరికి జన్మించిన బాలుఁడు సజీవుఁడైయున్నటులఁ దనకు వినవచ్చెను. అంత నా దురాత్ముఁ డాబాలువలన నపాయము శంకించి మంత్రులతో మంతనముచేయ వా రిట్లనిరి.

కం. "ఇట్టయినఁ దడయ నేటికిఁ,
బట్టణముల పందలందుఁ బల్లెలనెల్లన్
బుట్టెడు పెరిగెఁడు శిశువులఁ
బట్టి వధించెదము మమ్ముఁ బంపు మధీశా."

వారిపలుకులకుఁ జెవియొగ్గి కంసుఁడు పూతనాది రాక్షసుల బృందావనమున కంపెను. కాని వారు కృష్ణున కెట్టి అపకారమును జేయలేకుండిరి.

ఆ. "వెదకి వెదకి దైత్యవీరులు సాధుల
నడఁప వారిబలము లడఁగిపోయె;
యశము సిరియు ధర్మ మాయువు భద్రంబు
లార్యహింసనేయ నడఁగుఁ గాదె."

రాక్షసమార్గంబుల నవలంబించిన రాజులప్రతిభ యిట్లే నన్నగిల్లును. బలరామకృష్ణు లెట్టివీరులు కానుండిరో అది వారి బాల్యక్రీడలందే కాన్పింపఁదొడఁగెను.

సీ. "గోవల్లభుఁడ నేను గోవులు మీరని, వడి అంకవైచుచు వంగియాడు
రాజు నే భటులు మీరలు రండు రం డని ప్రాభవంబునఁబెక్కు పనులఁబనుచు
సేనపక్క రుండ మీరింటివా రని నిద్రవుచ్చి సొమ్ములుగొనిపోయి డాఁగు
నే సూత్రధారి మీరంద ఱు బహురూపు లని చెలంగుచు నాటలాడఁజెట్టు

* * * * * * * "

బాలక్రీడాకలాపములందే మానవుని భవిష్యద్వర్తనము గోచరించును. వత్స బకరూపంబులుదాల్చి వచ్చిన అసురుల మర్మంబులెరింగి కృష్ణుఁడు వారిని సంహరించెను. గోపగోపికా జనంబులు అంత:

కం. "ఆపదలమీఁద నాపద,
లీపాపనిఁ జెంది తొలఁగె నీయర్భకునిం
బైపడిన ఖలులు దహనునిఁ
బైపడు శలభములపగిదిఁ బడిరి ధరిత్రిన్."

అని యనుచు శ్రీకృష్ణుం గొనియాడిరి.

కాళీయుఁడను అహిపతి యమునానదీప్రాంతభూములందు అనేక ఉత్పాతంబులు కలిగించుచుండుట విని, కృష్ణుఁడొక నాఁడు యమునఁబవిత్రఁజేయఁగా నుత్సుకుఁడై ఆమడుఁగునడాఁగియున్న కాళియాహిపైఁబడి మర్దించెను. కాళియాహి చచ్చినక్రియఁ బడియుండ వానికాంతలు దురంతంబైన చింతాభరంబున శ్రీకృష్ణుని కడ కేతెంచిన, ఆతం డవధరించి కారుణ్యమానసుండై కాళియున కిట్లనియె:—

కం. "గోవర్గముతో మనుజులు,
ద్రావుదు రీమడుఁగునీరు వగ దిందుండన్
నీవును నీబాంధవులును,
నీవనితలు సుతులు జనుఁడు నేఁ డంబుధికిన్."

అంతట కాళియుఁ డటనుండి కదలి రత్నాకరద్వీపంబునకుం జనియె.

ఆటలాడుచు కృష్ణుం డొకనాఁడు యమునానదికవ్వలి వైపుననున్న మునులకడకు అన్నమడుగ గోపబాలురఁ బుత్తెంచెను. ఆమునులు గోపబాలుర మందస్థితింజూచి యన్నము లేదనిరి. పురుషులకన్న స్త్రీలెక్కుడు దయారసము కలిగి యుందురని యెఱింగి కృష్ణుఁడు దనవారి నయ్యార్యుల భార్యల కడకుఁ బుత్తెంచెను. అంత నా ధరణీసురసుందరు లన్నంబు కడవల నిడికొనివచ్చి ఆఁకలిగొనియున్న ఆగోపాలుర కిడిరి.

కం. "పరమేశ్వరార్పణంబుగఁ
బరజనులకు భిక్షయిడినఁ బరమపదమునం
బరఁగెదరు * * * "

ఆనాఁడు తమస్త్రీలు అనుభవించుచుండిన పరమానందంబుఁ గాంచి బ్రాహ్మణు లిట్లు చింతింపఁదొడఁగిరి:

కం. "జపహోమాధ్యయనంబులుఁ,
దపములు వ్రతములును లేని తరుణులు హరి స
త్కృపఁబడసి రన్నిగలిగియుఁ
జపలతబొందితిమి భక్తిసలుపమి నకటా."

కాని బ్రాహ్మణులు కంసభీతులయి బలకృష్ణసందర్శనంబు సేయఁ జనరైరి.

ఒకనాఁడు ఇంద్రయాగంబు సేయం దలంచియున్న నందాదులకడకు శ్రీకృష్ణుఁడే తెంచి యిట్లనియె:—

కం. "కర్మమునఁ బుట్టు జంతువు,
కర్మమ్మున వృద్ధిబొందుఁ, గర్మమునఁ జెడుం,
గర్మమె జనులకు దేవత,
కర్మమె సుఖదుఃఖములకుఁ గారణమధిపా."

విప్రుండు వైదికకర్మంబున మెలంగు; నృపతి ధరణీపాలనంబున సంచరించు; వైశ్యుండు వాణిజ్య కృషికుసీద గోరక్షణాదుల వర్తించు; శూద్రుం డగ్రజన్ముల సేవించి బ్రతుకు. సత్త్వరజస్తమోగుణంబు లుత్పత్తి స్థితి లయకారణంబు లందు రజంబున జగంబుజన్మించు; ఇంద్రుఁడేమి సేయఁగలవాఁడని, ఇంక నిట్లనియె:

సీ. "పసులకుఁగొండకు బ్రాహ్మణోత్తములకు మఖముగావింపుట మంచిబుద్ధి
ఇంద్రయాగంబున కేమేమి దెప్పింతు రవియెల్లఁదెప్పింపుఁ డరసి మీరు
పాయసంబులు నపూపములు సైఁదపుఁ బిండివంటలుఁ బప్పును పలయునట్టి
ఫలశాకములు వండఁబంపుఁడు హోమంబు సేయుఁడు ధేను దక్షిణల నిచ్చి

గీ. బహురసాన్నంబు వెట్టుఁడు బ్రాహ్మణులకు
నచలులై పూజలొనరింపుఁ డచలమునకు
నఘమచండాల శునకసంహతికిఁదగిన
భక్ష్యములఁ దెండు కసవుల పసుల కిండు."

నరులకు సంరక్షకులుగనుండినంతకాలమే సురలు పూజార్హులు. అసురులు అనేకవిధములగు బాధల నరులకుఁ గలిగించుచుండినను దేవేంద్రాదు లూరకుండిరి. అందుచేత శ్రీకృష్ణుఁడు వారిని పూజింపవలదని తండ్రిని వారించెను. ఇంతియేగాక సురలు దైత్యుల మండగములకుఁ దోడ్పడుచున్నట్లు కాన్పించెను. నందుఁడు యమునాజలంబులఁ గ్రుంకులిడుచుండ నొక్క దైత్యుం డాతని వరుణనగరంబునకుఁ గొంపోయెను. అంతటఁ గృష్ణుఁడు వరుణనగరంబున కేగి తండ్రిని విడిపించి తెచ్చెను. నాఁటినుండియు వరుణుండు యాదవులస్నేహం బపేక్షించుటకు మొదలిడెను. బలరాముఁడు వరుణదేవునితో మైత్రికావించి సురచేయువిధంబు నేర్చుకొనెను. ఈసురాపానమే తుదకు యాదవుల వినాశనము నకుఁ గారణమాయ్యెను.

ఇట్లు బలరామకృష్ణులు నానాఁటి కభివృద్ధిఁ జెందుచుండుట విని యాగంబుఁ జేయుమిషనుఁ గంసుండు రామకృష్ణులఁదనకడకు దోడ్కొనిరా నక్రూరునంపెను. అక్రూరునివెంట రామ కృష్ణులు మధురానగరంబున కేతెంచిరి కాని, వా రాతనితో ఆరాత్రి పురంబుప్రవేశింప నిరాకరించిరి. కృష్ణుండానాఁటి రాత్రి మధురానగరంబంతయు నామూలాగ్రంబుగఁ బరిశోధించి, మరునాఁటి యుదయమున కోటకేగుచున్న నొకరజకునిగాంచి యిట్లనియె:—

"మామంచలకోసఁ గట్టికొన మంచి పటంబులేవు నీము కేన్
సుందరధౌతచేలములు శోభిలుచున్నవి తెమ్ము."

ఆమాటల కా రజకుం డాగ్రహించి,

> "మా రాజసొమ్ముఁ గైకొన
> నేరాజులు వెఱతు రింతయొల్లిదమే!
> *   *   *   *
> గొల్ల, యేగుము తలఁగన్." అనియెను.

ఆచాకిపలుకులకుఁ గృష్ణుండు రోషించి ఘోరకరాగ్రతలంబ
వానితల పగులనడఁచెను. కృష్ణునిదారుణకృత్యంబునకుఁబౌరు
దిగులొంది రామకృష్ణులకుఁ గావలసినవెల్ల నాలుకమెదపక
యర్పించిరి.

కుబ్జయను కురూపి కృష్ణునకు మేనఁబూసికొన సుగ
లేపము లర్పించిన నాతండు సంతసించి, తత్పదంబులమీఁ
దనపదంబులుద్రొక్కి హస్తాంగుళద్వయమబల గవుదక్రిందవిష
నిడి కృష్ణుఁడు మీఁదికి నెత్తిన ఆ మెవక్రతలెల్ల మానెను. అం
మధురానగరంబంతయు శ్రీకృష్ణుఁడు దుష్టశిక్షణార్థము,
సంరక్షణార్థమే తెంచిన మహాపురుషుఁడను పలుకులు వ్యా
చెను. ధనుశ్శాలకరిగి అచ్చోనాతఁడు గురుతరమైనవిల్లువిర
ఆకోదండభంగనిర్గతధ్వానము భోజవిభుని బింకము ఛేదించె
తరువాత నాతఁడు కువలయాపీడ మను గజంబును వధించె
కంసుం డపు డటకేతెంచి:

కం. "చచ్చిన కుంభీంద్రంబును
వచ్చిన బలమాధవులను వరుసంగని, తా

నొచ్చిన చిత్తముతోడుతఁ
జెచ్చెరఁ గడువెఱచె భోజసింహుం డధిపా."

అంతటఁ గంసప్రేరితులై చాణూరముష్టికులను వీరులు శ్రీకృష్ణ బలరాముల మల్లయుద్ధంబునకు ఢీకొని మడిసిరి. కంసుండు భయకంపితుఁడై, ఆత్మవిశ్వాస మంతరింప మంత్రిలం జూచి యిట్లనియె:—

ఉ. "వల్లవబాలురన్ నగరివాకిటికిన్ వెడలంగ ద్రొబ్బుఁ డీ
గొల్లల ముట్టికోల్ గొనుఁడు క్రూరుని నందుని గట్టుఁ డుర్వికిన్
దెల్లముగాఁగ నేఁడు వసుదేవునిఁ జంపుడు; తండ్రిగాఁడు వీఁ
డెల్లవిధంబులం బరులకిష్టుఁడు గావకుఁ డుగ్రసేనునిన్."

కంసునికి ఆత్మబలముపై విశ్వాసమంతరించుట గమనించికృష్ణుఁ డాతనిపైకి సింహముక్రియన్ లంఘించి, పక్షీంద్రుం డురగంబుఁ బట్టువిధంబున కంసుని కేశబంధంబు లోకక్షోభంబుగఁబట్టి వానిని బడద్రోబ్బి చంపెను. కంసుఁడొనర్చిన పాపకృత్యములే యాతనిమనంబు వేధింప నందొకవిధమగు భీతిజనించెను. కాకున్న వీరాధివీరుండగు కంసుఁడు బాలుఁడగు కృష్ణునిచే నిహతుఁడగుట ఎట్లుసంభవించును? మనముచేయు పాపములే మహాభూతములై మనలను భ్రమందించును.

శ్రీకృష్ణుఁడు కోటనుండి కదలి కారాగృహమునకేగి అందు గుందుచుండిన దేవకీవసుదేవుల విడిపించి, మాతామహుండైన ఉగ్రసేనుందర్శించి:—

"అనఘ యయాతిశాపమున యాదవవీరులకున్ నరేశ్వరా
సనమున నుండరాదు; ****రమ్ము జనపాలన శీలివిగమ్ము వేడ్కతోన్"

అని వేడుకొనెను. వసుదేవుఁడైనను, ఆతనికుమారుండైనను గంసునిజంపి మధురారాజ్య మాక్రమింతు రని జరాసంధుఁడు కల్పించిన అపవాదము మిథ్యయని యాదవలోకంబున కెరుకపరుపఁగావలయు శ్రీకృష్ణుఁడుముదుసలియైనఉగ్రసేనున కేమరలఁ బట్టముగట్టెను. యాదవవీరులమనంబులందుజనించిన అనుమానములానాఁటితో నంతమొందెను. నాఁటినుండియు వివిధశాఖల యాదవులేకమై అభివృద్ధిగాంచ మొదలిడిరి.

"ఉగ్రసేనుని రాజుసేసినంతఁ, దొల్లి కంసభీతులై విదేశంబులకేగి కృశించుచున్న యదు వృష్ణి భోజ మరు దశార్హ కుకుర అంధక ప్రముఖులు సకలజ్ఞాతిసంబంధులతో నేతెంచి చిత్తంబులలర వారివారి నివాసంబులనుండ మొదలిడిరి."

ముందు కథావిధానంబునకు బలరామకృష్ణులు ఆర్య సాంప్రదాయముల నెఱుంగుట అత్యవసరమని తలంచి, వసుదేవుండాబాలురకు గర్గాదిభూసురోత్తములచే నుపనయనము చేయించి, అవంతీపురవాసియు, సకలవిద్యావిలాసియునైన సాందీపునికడకు నరువదినాలుగువిద్దెలు నేర్చుకొన వారల నంపెను. ఎదిగినబాలురగుటచే వార లన్నివిద్యలను ఎక్కుడు శ్రద్ధతో నేర్చుకొన మొదలిడిరి. ఆవిద్యల ఆవశ్యకతగు ర్తెఱింగి

యుండుటచే అతిస్వల్పకాలమున వారు సకలకళాకోవిదులైరి. మానవు లెవ్వరైనను గురువాక్యోద్యుక్తులైనఁగాని తత్కార్యారంభము చేయఁబోలరు. కావుననే వసుదేవుండా బాలుర గురువు కడకంపెను. సాందీపనివంటి విద్యావిశారదుఁడు శ్రీకృష్ణునివంటి మేధావంతునికి ఉపదేశికుఁడైనచో అఱువదినాలుగువిద్యలును అఱువదినాలుగుదినంబులలో బోధించెనన నాశ్చర్యమేమున్నది! ముందుకథయందుఁ జతురంగబలసమేతులును జతురులును నగు రాజన్యులతో శ్రీకృష్ణుఁడు పోరాడవలసియున్నది.

బాల్యక్రీడలందు శ్రీకృష్ణుఁడు కావించిన అద్భుతకృత్యములయందాతనికి భగవంతుఁడు తోడ్పడియుండిన నుండవచ్చు. ఇఁక ముందుకథయందు వెట్టిముట్టి గొల్లసుద్దులవలనఁ గార్యములు కానేరవు. కావుననే వసుదేవుఁడు ఆర్యావర్తరాజకీయ నాట్యరంగమున ముందు కృష్ణుండాడనున్న మహాభారతనాటకమునకుఁ గావలసిన విధానముల నెఱుంగఁగావలయు నవంతీపురమునకంపెను. లౌకిక వైదిక వ్యవహారముల నారితేరిన సాందీపని అభీరకృష్ణుని ఆర్యకృష్ణు నొనర్చి, అఖిల రాజతాపసలోకంబుచే మన్ననలందు నంతవానిగఁ జేసెను. చాణక్యుఁడు చంద్రగుప్తుని చేపట్టి ఆతని మగధసింహాసన మెక్కించుటకుఁ గావలసిన సాధనసామగ్రిఁ జేకూర్చినట్లు, సాందీపని శ్రీకృష్ణుని ఆ నాఁడు భారతవర్షమందు సూత్రధారిగ నుండఁజేయుటకే కావలయుఁ గావలసిన విద్యాబుద్ధులనెల్ల నలవడఁజేసి పంపెను.

# దుష్టసంహారణము—శిష్టరక్షణము

కంసవధతో శ్రీకృష్ణుని బాల్యక్రీడలు ముగిసినవి; కాని నాఁటినుండియు నాతఁడు బలసంపన్నులగు రాజాధిరాజులతోఁ బోరొనరింపవలసియుండెను. భోజకులు యాదవజాతియందలి అంతశ్శాఖ వారగుటచేఁదత్కంసవధ ఆర్యావర్తమున నొకజాతి అంతఃకలహముగఁ బ్రజలచే భావింపబడి యుపేక్షింపఁబడెను. కురుపాంచాలాధీశులచేఁ గంసుని క్రూరకృత్యములచే, ననేకులు యాదవవీరు లాతనియెడ నసంతృప్తిఁజెందియుండిరి. కావున శ్రీకృష్ణునకుఁ గంసవధ అంతకష్టమీయలేదు; కాని కంసుని మరణానంతర మాతని మామయగు మగధాధీశుఁడు శ్రీకృష్ణునితో నంతులేని పంతమూని పోరఁజొచ్చెను.

కంసుని మరణమున నాతనిభార్యలగు అస్తియుఁ బ్రాస్తియు విధవలై దుఃఖించుచుఁ దమతండ్రియైన జరాసంధునగరంబునకుం జని తమతండ్రితో నిట్లనిరి:—

శా॥ వాఁడ్రుడున్ వీఁడ్రుడను రాజులేయనుచు గర్వప్రౌఢితో యాదవుల్
వేండ్రంబైన బలంబుతో మథురకున్ వేవచ్చి నిష్కారణం
బాండ్రున్ బిడ్డలు బంధులున్ వగవఁ గంసాది క్షమానాథులం
దండ్రీ! చంపిరి; కృష్ణుచేత నిటు వైధవ్యంబు వచ్చెం జుమీ ॥

అనిన విని ప్రళయకాలానలంబు తెఱంగున మండిపడి శోకరోషంబులు బంధురంబులుగా జరాసంధుం డిట్లనియె.

శా॥ యేమీ కంసునిఁ గృష్ణుఁడే రణములో హింసించె నో చెల్ల! నా
సామర్థ్యంబు దలంపఁ, డించుకయు మచ్చండప్రతాపానలో
ద్దామార్చుల్ నశి నేఁడు గాల్చు యదుసంతానాటవీ వాటికన్
భూమిం గ్రుంగిన మింటఁడాఁగిన మహాంభోరాశిలోఁ జొచ్చినన్ ॥

అని జరాసంధుఁడు శ్రీకృష్ణుకడ కిట్లు కబురంపెను.

కం. "నీకొండె బ్రతికియుండుట,
నాకొండెంగాక గోపనందన, వినుమీ
లోకంబున నిస్థరకును
నేకసమయవృత్తి పొసఁగునే యిటమీఁదన్."

ఆమాటలకు శ్రీకృష్ణుఁడు దిగులొందక మందహాసం బొనర్చెను. జరాసంధునకు బలమధికముగనుండుట నాతఁ డెఱుంగును. జరాసంధుని పక్షమూనియుండిన రాజు లనేకు లుండిరి. పౌండ్ర కళింగ కరూశ చేది సాళ్వ విదర్భ యవన వేణుధారి సౌవీర గాంధార త్రిగర్త కామరూపదేశాధీశులును మఱియు అంగ వంగ సుహ్మ విదేహ కోశ కాశ దశార్ణ మద్ర పాండ్య దేశాధీశులును జరాసంధుని యాజమాన్య మంగీకరించి యుండిరి. ఇంక యాదవులకన్న నో ఆనాఁడు బలమధికముగ లేకుండెను. కావున జరాసంధుని బలంబులఁ గ్రమక్రమంబుగఁ గృష్ణుండు సంహారింప సమకట్టెను. అందుచేత నే కృష్ణుం డన్నయగు బలరామునితో నిట్లనియెను:—

ఆ. "మగధనాథుఁ బోర మడియింపఁ బోలదు,
మడియకున్న వీఁడు మరలి మరలి

బలముఁగూర్చుకొనుచుఁ బఱతెంచుఁ; బఱతేరఁ
ద్రుంపవచ్చునేల దొసఁగు దొఱఁగ."

అఖండభారతవర్షంబున నన్ని తావులకు వ్యాపించిన ఆజరాసంధ వ్యాధిని నిశ్శేషముగ నిర్మూలించుట కప్పటికిఁ దగిన బలంబులు లేమి శ్రీకృష్ణున కెక్కుడు కాలముపట్టెను.

కృష్ణుండు తాను మధురానగరంబున నుండుట అపాయ కరంబని యెఱింగి యాదవవీరులతో నాలోచించినంత, వారిలో నయకళానిర్ణిద్రుండగువికద్రుండను యదువృద్ధుండు వానికిట్లనియె:

"అపరిమిత నృప సహాయుఁడు,
కపటోపాయుఁడు గఠోర కర్మనిపుణుఁడు"

ఆ జరాసంధుఁడు

"యాదలిపాటునవచ్చి గదియవిడిసె".

కంసుండు బలగర్వితుండగుటంజేసియు, నీ మధురానగరంబున ముట్టడిసమయమున వలయు ధనధాన్యాదులును, ఆయుధంబులును సంగ్రహింపఁ బడకుండుటంజేసియు, నిప్పురంబు దుర్గంబని నమ్మరాకయున్నది: కావున:

కం. "విను దక్షిణాపథంబున
వనజేక్షణ, తనరు ఋష్యవంతము వింధ్యం
బును సహ్యము ననఁగాఁ గల
యనుపమశైలములు బహుగహన సంకటముల్."

తొల్లి ముచికుందుండు, పద్మవంతుండు, సారసుండు, హరితుం

డనువేళ్లఁగల యదువంశభూపతులు నలువురు వైరిభయనివార ణార్థంబై కావించిన దుర్గంబు లనేకంబులు కలవు పడమటి సముద్రంబులోని దీవులును బహువిధంబులు. ఈ నలువురు అనుజులకును బెద్దవాఁడైన మాధవుండే తొల్లి ఈమధురానగర మును బాలించుచుండెను".

విక్రదుని పలుకులాలించి కృష్ణుండింకొక దుర్గమప్రదేశం బున కేగుటకై సకలజనంబులకు నిర్గమసన్నాహం బాజ్ఞాపించె: నాలోనన,

ఆ. "కాలయవనుఁడనఁగఁ గాలకల్పుఁడు వంత,
సేచి మధురమీఁద సేఁగుదెంచెఁ
గపటె నరిక్ నపుడు యొంచి జరాసంధుఁ
డును గడంగె ననియు వినియె నొకట."

* ఈకాలయవనుఁడు జరాసంధుని ఆహ్వానంబున నార్యావర్తముపై దాడివెడలెను.

కాలవిలంబ మొనర్పక శ్రీకృష్ణుఁడు సకుటుంబులగు వృష్ణ్యంధకవీరులం దోడ్కొని సమస్తసంపదలతోడ సాగరాసూప ప్రదేశంబుఁజేరి, ‡ మందరమునకు నెనయైన రైవతకాద్రిచేరువను ద్వారవతీనామకంబగు పురంబు నిర్మింప, శాత్రవులవలని భయంబువిడిచి యాదవు లందుండిరి.

---

* Jayachendra invited Mohemmad Ghori. Doulat Lodi invited Baber.

‡ Mahendra in Orissa-Ganjam District

శకదరదపారదాదులును, హిమశైలాశ్రితులగు దస్యులుం దనకు విధేయులు గావున నిరవధిక సేనాసముదాయంబులతోఁ గాలయవనుఁడు మధురపై కేతెంచెను. కృష్ణుఁడు తనవారి నందఱిని ద్వారకయందుంచి తానొక్కఁడె పాదచారియై మధురకు వచ్చెను. వానిఁబట్టుకొనుటకుఁ గాలయవనుఁడు ఆయుధములు గైకొనకయే తనవారిని వీడి వచ్చెను.

కం. "చేయీక వాని మొనలకుఁ
బాయఁగ వెలయించి దవ్వు పఱచె నవథ్యో
పాయుఁడు హరి యదు గడుగున్
జే యందినయట్లు యాసనేయుచు వీఁకన్."

ఇట్లరిగియరిగి, దేవతలచే వరంబుఁగొనిన ముచికుందునిచేత కాతనిఁగొనివచ్చి, ఆతనిచే యవను నంతమొందించెను. కృష్ణుఁడు మఱలివచ్చి, మధురానగరంబున విడిసియున్న యవనముఖ్యుల నెల్ల వధియించి, యపరిమిత రథగజతురగసముదాయంబులం గైకొని యవిలంబితగమనంబునం ద్వారకకు విచ్చేసెను.

వింధ్యపర్వతంబునకు దక్షిణపార్శ్వంబున భీష్మకుండను భోజనృపుం డేలుచుండెను. ఆతని కుమారుండగు రుక్మి జరాసంధునిపక్షమూనియుండెను. శ్రీకృష్ణుఁడు వారినెట్లైనను దనవారిగఁజేసికొన నిశ్చయించెను. అందుచేతనే శిశుపాలునకీయ నిశ్చయింపఁబడిన రుక్మిణిని దాను గైకొనిపోయి రాక్షసవిధిని వివాహమాడెను. తన్నెదిరింపవచ్చిన జరాసంధాదుల నోడించి పారఁదోలెను. తరువాత రుక్మి కృష్ణుని

పక్షమూని ఆతనితో బాంధవ్యము లనేకములుగావించుకొనెను. కానికొంత కాలమైనతరువాత రుక్మికిఁబౌత్రియగు రుక్మవతియను కన్యను అనిరుద్ధునకిచ్చి వివాహ మొనరించు దినములలో రుక్మి కొందఱి దాక్షిణాత్యరాజుల ప్రోద్బలంబున బలరాముని జూద మాడఁబిలచి పరిభవింపఁజూచెను. ఆనాఁడు దాక్షిణాత్య భూములయందు కాళింగులే ముఖ్యులుగనుండినట్లు కాన్పించును యాదవులపలుకుబడి దక్షిణాపథమున నానాఁటి కభివృద్ధియగుట గాంచి, కాళింగప్రభువులగు వేణుధారియు, శ్రుతవర్మందును, అంశుమంతుండును, జయత్సేనుండును దమలో విచారించి రుక్మి పాలికిం జని యేకాంతంబున నతని కిట్లనిరి:—

ఉ. "నెత్తమునీఁకుఁ గౌతుకము దుర్భరమై జనియించె నిప్డు మా
చిత్తములందు నీవు గడుఁజిత్రపుజూదరి వాత్మలోన న
ద్వృత్తుఁడు సీరపాణి కడు వేడుక నాతనిం జయింతు.మే
మిత్తఱి నిన్నొకింత గవియింపు మొనర్పుము తత్ప్రసంగమున్."

వారిమాటల ననుసరించి రుక్మి బలరామునిజూదమాడఁ బిలిచెను. ఆజూదమున బలరాముఁడు రుక్మినిబరిహాసించి, రుక్మికిఁ దోడుగ నేతెంచిన కాళింగుని తలపగులనడఁచి పండ్లు డులిపి చంపెను.

ఆనాఁడు తనయన్నయొనర్చిన ఆకార్యములకుదానన్నపై నలిగినను, నాఁటినుండియు రుక్మి పక్షము లుడిగిన పక్షియగుటచే, దక్షిణాపథ భోజకులను (విదర్భభోజకులు) గూడ శ్రీకృష్ణుఁడు

తనకు దాసులుగఁ జేసికొనఁగలిగెను. కంసుని మరణమున మధుర భోజకు లిదివరకే కృష్ణునకు వశంవదులై యుండిరి కదా!

ఇట్లుండ నాకాలమునఁ బ్రాగ్జ్యోతిష మేలుచుండిన నరకుండనుమహాదనుజరాజు బదరీవనంబునఁ బుణ్యాయజనతత్పరులై కూడియున్న తపస్విపుంగవులకుఁ బెక్కుబాధ లిడుచుండెను.

అప్పటికి దక్షిణాపథంబున తనపలుకుబడి నదికమొనర్చికొని శ్రీకృష్ణుం డుజ్వలతేజోవంతుఁడయియుండెను.

తే॥ "అన్నులార్చి, హోతల నొంచి, యఖిల యోగ్య
వస్తు విస్తారములను విధ్వస్తములుగఁ
జేసి, యాఁడు వారలకెల్లఁ జెఱలునట్టి
కొనుచుఁ బోయె * * *"

ఇట్లు నరకుండు భామినుల కెక్కుడు బాధగలిగించుట విని శ్రీకృష్ణుఁడు ఆతని సంహరింప సత్యభామా సమేతుండై ప్రాగ్జ్యోతిషంబున కేతెంచెను. తమ్మెదుర్కొన నరకుండే తేరునంతఁ గృష్ణుండు నగుచు సత్య మొగంబునం జూడ్కి నిల్పి, నీవు కయ్యంపుమోపు మోపుమని నాభామిని చేతికిఁ దన శార్ఙ్గంబిచ్చిన, నయ్యింతి కొంతవడి పోరొనర్చి నరకునిరథంబు, సారథిని దునిమెను. స్త్రీలు పురుషులవిలాసార్థం బీశ్వరునిచే సృష్టింపఁబడిన క్రీడాపరికరములుగ భావించి, వారిని తనయిచ్ఛవచ్చినట్లుపయోగించుచున్న నరకుం డానాఁడు స్త్రీలుసర్వశక్తిస్వరూపిణులని గ్రహించి రిత్తబోయిన మనంబున వెనుకకేగి, కొండొక రథంబుగొని కయ్యంబున కేతెంచెను. నరకుఁడు మఱలివచ్చి

నంత కృష్ణుండు చక్రప్రయోగంబొనర్చి ఆతనింగడతేర్చి, నరక పుత్రుండగు భగదత్తునకుఁదండ్రిరాజ్యంబిచ్చి, నరకునిచేఁగారా గారమందుంచఁబడిన పదియాఱు వేల దేవకన్యలను విడిపించెను. ప్రాగ్జ్యోతిషమునుండి మగిడివచ్చు మార్గంబున దేవనివాసంబున కేతెంచి అచ్చటి పారిజాత వృక్షమును వ్రేళ్ళతోఁ బెఱికి ద్వారకకుఁ గైకొనివచ్చెను. బలిమిడిగిన దేవతలకు భాగ్యభోగ్యంబు లనవసరములని కాఁబోలు కృష్ణుఁ డట్లుగావించెను.

తండ్రిరాజ్యంబు కొడుకగు భగదత్తున కిచ్చివేసినను, ఆతని సిరియుసంపదయు నెల్ల ద్వారకకుఁగొంపోవుటను గృష్ణునిపై భగదత్తునకు దీఱనిపగ యుండెనన నసంభవ మేమున్నది!

నరకసంహారణమునకు శ్రీకృష్ణుని నాహ్వానింప నరుదెంచిన ఇంద్రుఁడే ఆనాఁటి దుస్థితినిగూర్చి, శ్రీకృష్ణునితో నిట్లనియెను:

చ॥ "నరకుఁడనంగ దైత్యకుల నాథుఁ డొకండు సరోజసూతిచే
వరములుగాంచి పేర్చి సురవర్గము నెల్లను గాసిచేసె సం
గరమున నేము వాని భుజగర్వము సైఁపఁగలేక యిందులన్
సిరిలుఁ దొఱం (లం) గి వచ్చితిమి చెన్నటి మానుష జాతిలోనికిన్"॥

ఇట్లనుట వలన అధికారసంపన్నులై సకలభోగము లనుభవించుచుండు నరులే దేవతలుగా పరిగణింపఁబడు చుండిరని తెల్లమగుచున్నది. అందువలన నేగద యిప్పటికింగూడ, అధికార సంపన్నుఁడై, సకలవైభములఁగూడియున్న వానిని ఈ జన్మమున నే దేవేంద్రుండనియును, ఆతని పదవిని దేవేంద్రపదవి యనియును, వాకొను నలవాటు వాడుకలోనికి వచ్చినది.

ప్రాచీదేశప్రాంతమున వింధ్యపర్వత సమీపభూములయందు (ఇంచుమించు పాతాళమున) మహారణ్యముల మధ్యనొక పురంబు నిర్మించుకొని (శోణపురము) ప్రహ్లాదుని మనుమఁడగు బాణుఁడు రాజ్యమేలుచుండెను. ఈతఁడు కలకాలముఆర్యావర్తముతో నెట్టిసంబంధమునులేకయుండెను. కాని కొంతకాలమున కాతని కూఁతురగు ఉషాకన్య అనిరుద్ధకుమారువరించి, చిత్రరేఖ యను తనచెలియల నంపి నాయాదవవీరుని శోణపురమునకు మాయచేసి కొంపోయెను. కృష్ణుండు కొంతకాలమున కని రుద్ధుని దురవస్థవిని బలభద్ర సాత్యకి ప్రద్యుమ్న ప్రముఖులును, యదు వృష్ణి భోజాంధక వీరవరులును వెంటరా శోణపురంబుచేరఁ జనెను. మార్గమధ్యంబున మహారణ్యంబున బలభద్రునికి శివ జ్వరము వచ్చెను.

అయ్యది అరణ్యప్రదేశమగుట, మలేరియా జ్వరములట యెండు. అట్లగుటను:

ఆ॥ "　　*　　*

మూడుకాళ్లు తలలు మూడునుగద్దన,[1]

జ్వరమువచ్చి తాఁకె సరభసమున."

అపుడు కృష్ణుండు:

ఆ॥ "తాఁకి యీజ్వరంబు తనచేతనున్న బ

స్మము సమంత్రికముగఁ జటులవృత్తి

1 మలేరియా జ్వరమునకు మూలమగు క్రిములు మూడు తలలును, మూడు కాళ్లును గలయట్టివిగా రూపించును.

నోరు తెఱుంగకుండ నురుసత్వనిధియైన,
సీరపాణిమీఁదఁ జిమ్ముటయును."

అనంతరము:

మ॥ "పరమాత్ముండగు శౌరి యప్పు డనలప్రాయంబు మాహేశ్వర
జ్వరదర్పం బణఁపం దలంచి నిజతేజస్ఫూర్తి శోభిల్ల దు
ర్భర [1] హైమంబనునట్టి శీతము జనింపంజేసి పొమ్మన్న ని
ష్ఠుర వృత్తిన్ జనె * * * "

అప్పుడు శ్రీకృష్ణుఁడు మంచు సృష్టించి అన్ననందు కప్పియుంచి ఆతనిజ్వరమును శాంతింపఁజేసెను. తరువాత యదువీరులు బాణునితో యుద్ధమొనర్చి, ఆతని బాహుగర్వ ముడిపి, ఉషాసుందరి ననిరుద్ధునితోఁ గనకరథంబున నిడుకొని ద్వారకకే తెంచిరి.

శ్రీకృష్ణుఁడు ఆర్యావర్తమందుండిన పురాతన రాజకుటుంబములు వారిని దాను స్వయముగ సంహరించుటకు సంకల్పించుకొని యుండలేదు. అందుచేతనే మగధాధీశుఁడైన జరాసంధుని వధియించుటకు వేఱొకనిని వెదకుచుండెను. యాదవులార్యావర్తరాజకీయ నాట్యరంగమున స్వయముగ జోక్యము

[1] Manufacture of Ice & Treatment by Ice, ఈ మొదలగునవి శ్రీకృష్ణునకు విదితమనుట కాదా! మంచుతయారు చేయుట, మంచుగడ్డతో జ్వరచికిత్స చేయుట, మొదలగు విషయములకు మనపాశ్చాత్యసోదరులే ఆచార్యులని వాదింపఁగనవలదు.

కలిగించుకొనినచో, ఆర్యవంశపు క్షత్రియులందఱునేకమై యాదవులతోఁ బోరొనరించినచో, భరతవర్షమున సురాసురయుద్ధములట్లు, యాదవ ఆర్యయుద్ధములుప్రారంభమై ఎక్కుడుజనక్షయమునకుఁ గారణమగును. అందుచేత శ్రీకృష్ణుఁడు ఆర్యావర్త నృపులలో నగ్రేసరులును పౌరవ్యులలోని వారును నగు పాండవేయులనే తనఉద్దేశముల నెఱవేర్చుకొన సాధనములుగ నెన్నుకొనెను.

ఆర్యావర్తమందుండిన రాజవంశముల కెట్టి మనస్పర్థ లుండెనో చూతము:—

పాంచాలురకు నానాఁటికి బలమధికమగుటచే ద్రుపదుఁడు పొగరెక్కి అచ్చోనుండిన బ్రాహ్మణులఁ జులుకనగఁ జూడ మొదలిడెను. అందులకు ద్రోణాదు లలిగి, పుత్ర మిత్రకళత్రాగ్నిహోత్ర శిష్యగణంబులతో హస్తిపురంబుఁ జేరిరి. భీష్ముఁడు ద్రోణుని గురురాజకొమరులకు అస్త్రవిద్యగఱపుటకు నియోగించి గౌరవించెను. ఆబాలుర నస్త్రవిద్యాపారంగతులఁగావించి, వారిని వెంటఁగొని ద్రోణుఁడు ద్రుపదుని బరిభవింపనే తెంచెను. ఆయుద్ధమున నర్జునుఁడుద్రుపదునిబట్టి కట్టితెచ్చి, ద్రోణునెదుటఁ బెట్టెను. అంతట ద్రోణుఁడు మందస్మిత వదనారవిందుఁడై ద్రుపదునితో:

ఆ. "ఇంకనైన మమ్ము నెఱుఁగంగ నగునొకో......"

అని యుల్లసములాడి ద్రోణుఁ డాద్రుపదుని విడిచి

పుచ్చెను. విప్రు నలుకయు, దృణహుతాశనంబును దీర్ఘంబుగ నుండునవి గనుకనా !

పాండువిభుని మరణానంతరము కృష్ణద్వైపాయనుండు కుంతీపాండవులందెచ్చి హస్తినాపురమున విడిచి సత్యవతి కేకాంతంబున నిట్లనియె.

క. "క్రూరులు విలుప్త ధర్మా
చారులు ధృతరాష్ట్రసుతు లసద్వృత్తులు ని
ష్కారణవైరులు వీరల
కారణమున నెగులు పుట్టు గౌరవ్యులకున్"॥

అందుచేత నే సత్యవతి కోడండ్రగు అంబికాంబాలికలం దోడ్కొని వనంబునకుం దపంబు సేసికొన నేతెంచెను. అప్పట్టున నామె పారాశర్యానుపదేశంబు భీష్మవిదురుల కెఱింగించెను. అందుచే భీష్మవిదురులు ధృతరాష్ట్రునకు బోధించి పాండవులను వారణావతమున కనిపిరి. కాని దుర్యోధనాదులు పాండవుల కపకారము ఘటింపనెంచి, పురోచనుండను తమముఖ్యకార్మికునంపి, వారణావతంబున నాయుధశాలా సమీపంబున లక్షా సర్జరస సమ్మిశ్రంబై ఘృతతైలార్ద్రంబయిన మృత్తికాపుంజంబున నొక్క చతుశ్శాల నవిరళ సంధాధవళితంబుగా నిర్మించి, అందుఁ బాండవుల నుండఁబంచిరి. పరాభిప్రాయ మాయోపాయ ప్రయోగవిదుండైన ధర్మతనయుండు తమ్ములతో నిట్లనియెను.

కం॥ "ఎఱిఁగితిమి దీనితెఱఁగే
మఱి కెఱుఁగని యట్లు గూఢమతి నుండుద మిం

దహనముఁ బురోచనుకృతకము,
నెఱిఁగేర్పడు నంతకును వినీతాత్ములమై".

ధర్మజునిశీల మెట్లున్నదో యిందుః గమనింపదగును!

విదురునాదేశంబున ఖనకుండనువాఁడు వచ్చి పాండవుల రక్షించుటకు బిలంబు నొకదానిని నిర్మించెను. భీముండా లక్కయిలుగాల్చి అన్నదమ్ములతోఁగూడ బిలంబుఁబట్టి అడవి కేగెను. ఇప్పటి కింకను శ్రీకృష్ణుండు పాండవుల కెట్టి సహాయ్యమును జేయలేదు.

పాండురాజు ధర్మపత్నియగు కుంతీదేవి భోజవంశమునంజనించెను. అందుచే నామె శ్రీకృష్ణునకు మేనయత్త కావలయును. పౌరవ్యులలోనెల్ల పాండవులే యాదవులకు సన్నిహిత బంధువులు. అధికారమునందున్న కౌరవులు పాండవులను బాధ పెట్టఁదొడఁగిరి. కావున శ్రీకృష్ణునకు వారిపైఁ బ్రేమమెండయ్యెను. తాము పడుబాము లెల్లఱకును దెల్లంబగుటకు ధర్మజుండు లాక్షాగృహదహనమున కంగీకరించి, తల్లితోడను దమ్ములతోడను ఏకచక్రపురంబున కేతెంచి, బ్రాహ్మణ వేషంబున నుండుట కియ్యకొనెను. అటనుండి వారు ద్రౌపదీ స్వయంవరమునకు ద్రుపదువీటి కేగిరి.

భారతవర్షమును ధర్మబద్ధముగ నేలఁజాలు మహావీరు నన్వేషించుచుఁ గృష్ణుఁడు పాంచాలనగరంబున కేతెంచెను. అచ్చోనర్జునుఁడుమత్స్యయంత్రముఁగొట్టి ద్రుపదపుత్రినిబడసెను. తత్క్షణమే అచ్చటి కేతెంచియుండిన రాజులందఱు బీదబాపలుగఁ

గాన్పించుచుండిన ఆపాండవులతోఁ బోర సుంకించుచుండ, శ్రీకృష్ణుండు పాండవుల క్షేమము గోరి వారల కిట్లనియె:

చ॥ పరులకు దుష్కరంబయిన భాసురకార్యముఁ జేసి, తత్స్వయం
వరమున బత్నిఁ గాఁబడసె వారిసహాయత నెట్లఁ గృష్ణ నీ
ధరణి సురాన్వయోత్తముఁడు; నర్మవిధిం జెపుఁడయ్య యింక నె
వ్వరికిని జన్నె వీని ననవద్యపరాక్రమ మాక్రమింపఁగన్?

కృష్ణునిచేత నివారితులై రాజపుత్రులు తమతమ దేశం బులకుంజనిరి. బలభద్ర సమేతుండై కృష్ణుండు పాండవులున్న తావునకుఁజని తమ్మెఱింగించి, వారి సేమం బారసి—అర్జునుండు తానార్జించి తెచ్చిన పడతిని తల్లిఆజ్ఞానుసారము అందఱి అన్న దమ్ములతో సమముగ ననుభవించుట కంగీకరించుటఁగాంచి, ఆశ్చర్య నిమగ్నుండయ్యెను. నవయౌవనుండగు వీరాధివీరుఁడు తాను సర్వరాజసమక్షంబున నార్జించితెచ్చిన త్రిలోకసుందరిని తనతక్కిన అన్నదమ్ములు తనతోపాటుగ భార్యగ ననుభ వింతుమన్న దాను లోభమించుకంతైనలేక సమ్మతించిన వ్యక్తి ఎంతస్వార్థత్యాగి! అట్టి ఉదారస్వభావునిరాఁగోవు మహ త్తర కార్యములందు ముందుంచుటకుఁ గృష్ణుఁడు నిశ్చయించు కొనెను. పాంచాల యాదవ సాహాయ్యము పాండవులకుఁబ్రాప్తిం చుటచే ధృతరాష్ట్రిండు దిగులొంది పాండవులం దోడ్తేర ద్రుపదుపురంబునకు విదురు నంపెను.

వారు హస్తిపురంబున కేతెంచినతరువాత ఆవృద్ధ కురుపతి కృష్ణుండును సకలవృద్ధ రాజులునుంగల సభయం దర్ధ

రాజ్యము పాండవులకిచ్చివేసెను. అపుడు ధృతరాష్ట్రుఁడిట్లనియె,

ఆ॥ "సర్వలోకకర్మసాక్షి యీ కృష్ణుండు
సాక్షిగాఁగ మీకు సకలవృద్ధ
రాజులొద్ద నర్ధరాజ్యమిచ్చితిఁ బాండు
రాజ విభవమెల్ల రయముఁ గొనుఁడు"

ఖాండవప్రస్థము నివాసముఁ జేసికొనియుండుఁడని పాండవుల నావృద్ధరాజునియమించెను. అంత శ్రీకృష్ణునిఆదేశముపై ఇంద్రుఁడంపవిశ్వకర్మ వచ్చి సురపురమున కెనయగు పురము నిర్మించి యద్దానికి ఇంద్రప్రస్థమను నామకరణ మొనర్చి చనెను.

అర్జునునియెడ కృష్ణునకు ప్రేమమధికముగ నుండుటచే, బలదేవాదు లెఱుంగకుండ సుభద్రార్జునులకు వివాహంబు సేయ నమకట్టి పశుపతి పూజామహోత్సవవ్యాజంబున నఖిల యాదవ భోజాంధక వృష్ణి వరులతోఁ గృష్ణుండంత ద్వీపంబునకుంజనియె. యతిరూపంబున ద్వారకకేతెంచియుండిన అర్జునుండు కృష్ణుఁడు పంచిన మార్గం బనుసరించి సుభద్రం దోడ్కొని పోవుచుండ పృథశ్రివసుఁ డాదిగాఁగల యదువీరులా యతిరథంబునకెదురై నిలిచిరి.

తనకు సుభద్రి తేరుగడపుచుండ, నమితమగు యాదు సైన్యముల నోడించి అమరేంద్రసుతుఁ డనిలో లబ్ధవిజయుఁడై పరమోత్సాహంబున నరిగెను.

ఇట్లగుటచే, సుభద్ర నర్జునుఁడు గైకొనుట యాదవు లిష్టపడలేదనుట కాదా!

తరువాత నర్జున సమేతుఁడై కృష్ణుండు వెడలి ఖాండవ వనము దహింపఁజేసెను. ధృతరాష్ట్రుఁడు పాండవుల కిడిన భాగ మందు ఖాండవవనముండెను. ఆసుభిక్షమగు ప్రదేశ మెుకప్పుడు దేవేంద్రుని స్వాధీనమందుండుటచే నాతఁడు కృష్ణార్జునులతోఁ బోరనే తెంచెను. కాని కృష్ణార్జునులింద్రునోడించి ఆతనికడనుండిన దివ్యాస్త్రంబులఁ గైకొనిరి. అర్జునుం డాదవానలమున గ్రమంద నుండిన దానవవిశ్వకర్మయైన మయుని రక్షించి యాతనివలన నొక దివ్యసభయు, భీముని ఉపయోగార్థము గదయుఁబడసెను. వాఁటినుండి దానవవిశ్వకర్మయైన మయుఁ డనుచరసమేతముగ నార్యావర్తము వీడి సముద్రాంతర భూములకు వలసపోయెను. ఈతని సంతతివారే మధ్యఅమెరికా దేశమునందు నూతన నివా సములేర్పఱచుకొని ఎక్కుడుగ నభివృద్ధిఁ జెందిరి. వారి పట్టణ ములకట్టడపురీతులు, దేవళములపైనున్న చిహ్నములు, నేఁ డనేకములు గాన్పించుచున్నవి.*

వరుణదేవునిచే వెంటాడఁబడిన అసురులు పశ్చిమదేశం బులకేగిరి. కృష్ణార్జునులచే వెంటాడఁబడినవారు (కాలకేయ, నివాతకవచులు) హిందూమహాసముద్రమందలి దీవులకును, బిమ్మట శాంతమహాసముద్రము దాఁటి అమెరికాదేశమునకును వలసపోయిరి.

మునిప్రేరితుఁడై ధర్మజుఁడు పితృప్రీతిగ రాజసూయముఁ జేయనుద్దేశించి, తనకోర్కె శ్రీకృష్ణునకు విన్నవించిన నాతఁడు:

* The ancient Maya civilization of Central and South America.

"పరశురాముచే ధాత్రి యపగతక్షత్త్రింబయ్యె. అంతనుండియైల వంశంబును నిక్ష్వాకువంశంబునుండక్కఁ దక్కినక్షత్రియవంశంబు లెల్లఁగృత్రిమంబులయ్యె; యయాతిభోజవంశంబులు చతుర్దిశలను వ్యాపించె; అయ్యవి తరువాత జతుర్దశవంశంబు లయ్యె. ఇట్టి సకలక్షత్రియవంశంబులఁ జయించి అసురపక్షపాతియగు జరాసంధుండున్నవాఁడు. వానితోడి వైరంబు బలవంతంబగుటం జేసి మేము మధుర నుండనోల్లక కుశస్థలంబునకువచ్చి రైవతక పర్వతంబున ఘనంబుగా దుర్గంబు నిర్మించుకొని భవదాశ్రమంబున సుఖంబున్నవారము.

చ॥ ఖలుఁడు బృహద్రథాత్మజుఁడు గర్వితుఁడై మహిలోని రాజులం
దెలుపుటఁబట్టి తెచ్చి చెఱఁబెట్టి గిరివ్రజ మన్పురంబులోఁ
బొలయక నిత్యమొక్కొకని బూనరిబోలె వధించి నేమమున్
బలిమియు నేర్పడం గడఁగి భైరవ పూజమొనర్చు నుగ్రుఁడై.

అట్టివానింజంపినంగాని సామ్రాజ్యవిభవము మీకు సుస్థిరంబు గానేరదు." అని యనియె.

ఆమాటలువిని సమబలుండగు భీమసేనుండలిగి, యన్న కిట్లనియె:

కం॥ "ఈ హరికరుణయు నర్జును,
సాహాయ్యముఁ గలుగ నీ ప్రసాదమున జగ
ద్ద్రోహు జరాసంధు మహా,
సాహసు వధియింతు నుగ్రసంగ్రామమునన్."

భీముండుగాని యొండొరులు మాగధుని వధియింప సమర్థులు గారని కృష్ణుఁ డెఱుంగుట ధర్మజున కిట్లనియెను:—

చ॥ "విను మగధేశ్వరుఁ డెపుడు విప్రజనావళియందు భక్తిమయున్
వినయముఁ గల్గి యొద్దయును వేఁడినవారికి వృథ సేయక యిచ్చుఁ గా
వున నిఁక నర్జునుండు పవనోద్భవుఁ డేనును బ్రాహ్మణాకృతిం
జని రణభిక్ష వేఁడిన వశంవదుఁడై యతఁ డిచ్చుఁ గోరికల్"

ధర్మజు ననుమతి భీమార్జునుల వెంటఁగొని బ్రాహ్మణ వేషంబులు దాల్చి గిరివ్రజంబు సొచ్చి జరాసంధునిచే నతిథి పూజలందు కృష్ణుఁ డమ్మగధనాథున కిట్లనియెను:

"* * * * * * ...
కీనత నాజభిక్షు యితఁ డింద్రతనూభవుఁ డేనుపేంద్రుఁడన్,
భావని యాతఁ డెవ్వనిని బైకొని యొక్కటి పోరఁగావలెన్."

కృష్ణునిపలుకులకు జరాసంధుండు నవ్వి "మామక నోర్బలశక్తికిఁ దుల్యుఁ డీమరుత్సూనుఁడు, వీని నెదుర్తు" నని చెప్పి, బురి వెలికేగి యచట సమతలభూమిని భీమునితో గదా యుద్ధంబునకు గడంగెను. "ఇవ్విధంబున వారు పోరుచుండ, కృష్ణుండు జరాసంధుని జన్మమరణ ప్రకారంబు తెలుఁగుటలం జేసి సమీరనందనుండు చూచుచుండ నొక్క శాఖాగ్రంబు రెండుగాఁ జీల్చివైచిన, నతండు నాకీలు దెలిసికొని మాగధునిం బడ ద్రోచి వానిపదంబు పదంబునం ద్రొక్కి బాహుయుగళంబున రెండవపదంబు పట్టి మస్తకపర్యంతంబు వ్రయ్యలుచేసి చంపె. అప్పుడు శ్రీకృష్ణుఁడు జరాసంధసుతుండైన సహదేవుని మగధకు పట్టాభిషిక్తుఁ గావించి, గిరివ్రజమునుండిన రాజుల బంధవిముక్తులఁ జేసి వారల కిట్లనియె:

ఉ॥ "మీరలు ధర్మమున్ విడక మేరయుఁ దప్పక భూజనాళిఁ జెం
పారయ సౌఖ్యసంపదలు నందగ బ్రోచుచు భూరియజ్ఞముల్
గౌరవవృత్తి మత్పరముగా నొనరించుచు మామకాంఘ్రి పం
కేరుహముల్ భజించుచు నకిల్బిషులై చరియింపుఁ డిమ్ములన్."

సూత్రప్రాయముగ శ్రీకృష్ణుఁడు తన జీవితాశయముల నిందుఁజెప్పియే యున్నాఁడు.

ధర్మజుఁడు రాజసూయయాగంబు ప్రారంభించి, వచ్చినవారి యందగ్రపూజార్హు లెవ్వరని సదస్యులనడిగిన, వారందఱును శ్రీకృష్ణుఁజూపిరి. అంత:

కం॥ "వంచితకాంచన రుచితో,
దంచిత వస్త్రముల నూతనార్ఘ్య ప్రథలన్
మించిన రత్నములం బూ
జించెన్ ధర్మజుఁడు కృష్ణు జిష్ణు సహిష్ణున్."

ఈ రాజసూయయాగంబువలన యుధిష్ఠిరునకు సార్వభౌమతయును శ్రీకృష్ణునకార్యావర్తరాజలోకంబున నద్వితీయ పురుషుఁడను మహాగౌరవమ్మునుం గూడ నేకముహూర్తంబునఁ బ్రాప్తించెను. యుధిష్ఠిరునవివేకమువలన తరువాత పాండవులకు కొన్నిదురవస్థలు ప్రాప్తించెనేగాని, రాజసూయయాగముతో శ్రీకృష్ణు సంకల్పములు నెఱవేఱె ననియే చెప్పనగును.

జరాసంధుని ముఖ్యసేనాపతియు, స్నేహితుండునునైన చేదిపతియే శిశుపాలుఁడు, శ్రీకృష్ణునకుజరిగిన గౌరవముచూచి సహింపలేక, పీఠముడిగ్గి నిలచి సభాసదులంజూచి యిట్లనియె:

తే॥ "బరగమున్న యయాతి శాపమునఁజేసి,
వాసికెక్కఁడు యీ యదువంశమెల్ల
బ్రహ్మతేజంబునెల్లఁ గోల్పడిన యితఁడు,
బ్రహ్మ ఋషి సేవ్యుఁడగునె గోపాలకుండు?"

అమ్మాటలకలిగి ముకుందుం డాగ్రహంబునలేచి తటాలున శిశుపాలునిపైఁబడి దన చక్రంబున దునిమెను.

శిశుపాలుని సంహరించుటచే సాల్వుఁ డలిగి మయ నిర్మితమైన 'సౌభక' మను కామగమనముగల తన వ్యోమ యానముతో ద్వారకపైఁబడి అద్దానిఁ గొల్లగొట్టెను.

సాల్వుని సౌభక విమానమిట్లు వర్ణింపఁబడియున్నది:

సీ॥ *"ఒకమాటు సభమున బ్రికటంబుగాఁదోఁచు,
నొకమాటు ధరణిపై నొయ్యనిలుచు
నొకమాటు శైలమస్తకమున వర్తించు,
నొకపరి చరియించు నుదధినడుమ."

రాజసూయమునుండి వచ్చిన తరువాత కృష్ణుఁడు కల కాలము సాల్వునితోఁ బోరినఁగాని వానిసంహరించుట సాధ్యము కాలేదు. కృష్ణుఁడు సాల్వునితో నిరంతర యుద్ధములనిమ

* [దీనినిబట్టి ఆనాఁటి విమానములు జలస్థల భేదములేక వర్తించుచుండి నట్లు కాన్పించును. ప్రస్తుతము మనము గాంచుచుండిన విమానములు Sea Planes, Land Planes అని రెండువిధములుగనున్నవి; కావున నవీన శాస్త్రజ్ఞులు సౌభక విమానమువంటి దానిని నిఁక కనుగొనవలసి యున్నట్లు తోఁచెడిని.]

గ్నుఁడై యున్నపుడే ధర్మజుఁడు జూదమాడి, రాజ్యము సర్వ
స్వము కౌరవులకోడి, కానల కేగెను.

మయసభ చూడనేగినప్పుడు, అచ్చోనుండిన చిత్రవిచిత్రంబులఁగాంచి దుర్యోధనుండు మతిచెడి అవివేక కార్యంబు
లాచరింప మొదలిడుటచేఁ గొందఱాతనిఁజూచి నవ్విరి. అందు
కాతఁడు కనలి మయసభ తన్నగౌరవించుటకే కల్పింపఁ
బడినదని తలంచి యుధిష్ఠిరు నెట్లైన పరిభవించి వానిరాజ్య
మపహరింప వలెనని సిద్ధసంకల్పుఁడైయుండెను. 'ధర్మజుని జూద
మాడ బిలిచినచో నీకోర్కెలీడేర్తు'నని శకునియనెను. ఆనాఁడు
రాజులలో జూదమాడుటతప్పుకాదు. కావున తమ్ముని అనుజ్ఞన
మంగీకరించి ధర్మజుఁడు దుర్యోధనుతో జూదమాడఁబోయెను.
ధర్మమార్గానువర్తియగు నాపాండవాగ్రజుఁడు శకుని పన్నిన
వలలో చిక్కుకొని రాజ్యము సర్వస్వమేగాక, భార్యా
సోదరసమేతముగ తాను కౌరవులకుదాసుఁడుకావలసివచ్చెను.
పాండవులనగౌరవింపదలఁచి దుర్యోధనుఁడు జూదమునదాస్యము
నకు పాల్పడినపాంచాలిని కురుసభకు తెప్పించెను. వృద్ధరాజున
కీవార్త వినవచ్చినంతనే ఉపద్రవములు సంభవించునను భీతిచే
పాండవులను దాస్యవిముక్తులుగఁజేయనాజ్ఞయిడి, ద్రౌపదికి కురు
రాజ్యమం దర్ధభాగ మొసంగెను. పాండవులు రాజ్యభోగము
లనుభవించుటఁ జూచి దుర్యోధనుఁ డోర్వలేక ధర్మజుని
మఱల జూదమునకు బిలిచి రాజ్యముంగొని పదమూఁడువత్స
రములు రాజ్యభ్రష్టులైయుండ నియమించి వారిని పంపివేసెను.

మాయజేసి జూదమాడి వంచనచే నోడించి కౌరవులు పాండవుల రాజ్యభ్రష్టులఁ జేసి యడవులకు బంపిరని విని కృష్ణుం డుపప్లావ్యంబునకు బాంచాల యాదవ వృష్ణి భోజాంధక కేకయాదు లెల్ల వెంట రాఁ జని, వారి దురవస్థఁ గని పాండవయశోభివృద్ధికిఁ దా నొనర్చిన ప్రయత్నము లెల్ల నిష్ప్రయోజనంబు లగుటకు విచారించి దుర్యోధనాదుల మోసఁ గని తన వారి కిట్లనెను:

క॥ "అవినీతుల దుష్టులఁ గౌ
రవ నాశులఁ జంపి ధర్మరాజు నృపుఁ గురు
ప్రవరున కొనరింతు నా
యవనీ రాజ్యాభిషేక మవిజితకీర్తిన్."

"అత్యవసరంబున నేను మీయొద్ద నుండమిం జేసి యిట్టి వ్యసనంబు సంభవించె.* ఏను సముద్రతీరంబున సాల్వుతోఁ బదనెలలు యుద్ధంబు నేసి వాని వధియించు పొంటె నక్కడ మసలితి" అని పాండవుల నోదార్చి వారి బాలుర వెంటఁగొని ద్వారకకేతెంచెను.

సత్యభామతోఁ బాండవులయొద్దకు వచ్చిన శ్రీకృష్ణుఁడు యుధిష్ఠిరునకు ఆర్యావర్త సామ్రాజ్యాధిపత్యమిచ్చుటకు తన నిశ్చయ మిట్లాలోచించియే యుండెను:

---

* సర్వజ్ఞ జూదముగాని, ద్రౌపదీపరిభవ ప్రయత్నములుగాని యెఱుఁగని కృష్ణునకు ద్రౌపదీ వస్త్రాపహరణ గాథాసూత్రము వెలసెనుంగ నయ్యెనో!

చ. "దమమును సత్యయుక్తియును ధైర్యనిరూఢియు నిత్యతృప్తియున్
శమమును నీకు నైజములు సమ్మతి నర్థవశంబు గామ లో
భములను జొంద వట్టుగుటఁ బార్థివకుంజర ధర్మరాజనా
మమునఁ ద్రిలోకపూజ్య మహిమం బొగడొందెద వెల్లకాలమున్.

ఈ యంధకవృష్ణిభోజకుకురాన్వయభూపతు లెల్లరు నీ యిచ్చవచ్చినట్లు ప్రవర్తింతురు."

పాండవులంతటి పరమయోగ్యులే వారిచెంత కృష్ణుండు లేకుండిన కాలమందు దుర్వ్యసనసంకులకు బాల్పడుచుండిరి. ఆర్యావర్త రాజలోకంబానాఁడెట్టి నికృష్టదశయందుండెనో దీనినిబట్టి యెఱుంగనగును.

శ్రీకృష్ణుండేగిన తరువాత అర్జునుఁడు శివునిగూర్చి తపం బాచరించి ఆతని మెప్పించి పాశుపతాది దివ్యాస్త్రంబులఁ బడ సెను. ఇంద్రాది దేవతులుకూడ పాండవశిబిరంబున కేతెంచి తమకడనుండిన దివ్యాస్త్రంబుల నర్జునునకిచ్చి వానిని దేవకార్యా ర్థమంపుమని ధర్మజు వేఁడిరి. అర్జునుఁడు దేవేంద్రు వెంటనేగి దానవ వీరులగు నివాతకవచులఁజంపి దేవతల ఋణముదీర్చివచ్చెను. వనవాసంబుననున్న కాలమువృథపుచ్చక పాండవులు రానున్న మహాభారతయుద్ధమునకు కావలసిన సాధన సంపత్తి నార్జించు కొనుటకే ఉపయోగించుకొనిరి. తమ్ము పరిభవింపనేతెంచిన దుర్యోధనుఁడు గంధర్వప్రభునిచే గొంపోఁబడినప్పుడు ధర్మజుఁడు తమ్ములనంపి వాని విడిపించి పౌరవ్యుల గౌరవమునకు భంగ

పాటొందవకుండ కాపాడెను. బుద్ధిమంతులు కష్టములకు క్రుంగి కృశింపక, తమపురోభివృద్ధికి నద్దానినొక సోపానముగ చేసుకొన ప్రయత్నింతురు.

గీ॥ "ధార్తరాష్ట్రుల చర్యకుఁ దలఁకకుండ
దారుణారణ్యవాసంబు మీరివచ్చి
పాండురాజ కుమారులు వఱలుచుండ్రి
అగ్ని సంతప్త కాంచనంబట్లు మిగుల॥" (ఆధునికము)

పాండవులు పదమూఁడగు నేటఁ దా మొనర్పవలసిన యజ్ఞాతవాసదీక్ష మత్స్యభూపతియగు విరటుపురంబున గడుప నిశ్చయించిరి. ద్రుపదుని తరువాత విరటుఁడే ఆర్యావర్తమం దధికబలవంతుఁడు. తనకు సింహబలుని సహాయముంటుటచే దుర్యోధనునిసైత మీవిరటుఁడు లెక్క సేయకుండెను. తమ సత్ప్రవర్తనమువలన బాండవులు విరటుని యభిమానమార్జించిరి. కౌరవులు విరటు నగౌరవించుటకు సర్వసైన్యసమేతముగ నేతెంచి మత్స్యాధిపుని గోవులఁ గొంపోయినపుడు మారువేసమునన్న అర్జునుఁడేగి కౌరవయోధుల పరిభవించి గోగణంబుల మఱల్చుకొనివచ్చి విరటుని కృతజ్ఞతకుఁబాత్రుఁడయ్యెను. అందుచే బాండవులను గుర్తెఱింగిన తరువాత విరటుఁడు తన కూఁతు నర్జునునకీయ సంకల్పించినట్లు తెలుప, అర్జునుఁ డా బాలికను అభిమన్యునకు భార్యగఁగైకొని, విరటుని ఆప్త బంధునిగఁ జేసుకొనెను.

ఉత్తరవివాహమునకు పాండవపక్షమువారగు రాజులందఱునువచ్చిరి. శ్రీకృష్ణుఁడును బలరామ సాత్యకిసమేతముగా నచ్చోటికి విచ్చేసెను. ఆసభయందు కృష్ణుఁడు రాజలోకంబు నవలోకించి, తమకు పైతృకంబగునట్టిదియు, రాజసూయంబున నలవఱిచికొన్నట్టిదియు, ధార్తరాష్ట్రులు వంచనమెయి గైకొన్నట్టిదియు నగు రాజ్యంబు పాండవులకు పునస్సంపాదన సేయుకార్యంబునకుఁదోడ్పడవలెనని బోధించెను. విరాటద్రుపదులు తప్పకసాయపడుదుమని బాసయిచ్చిరి. కృష్ణుఁడుమాత్రము తానెట్టిసహాయముచేయనుండెనో స్పష్టీకరింపలేదు—బలదేవుఁడు కౌరవపక్షపాతిగను, సాత్యకి పాండవపక్షపాతిగను ఉండుటచే శ్రీకృష్ణుఁడప్పటికిఁ దటస్థుఁడై యుండవలసివచ్చెను. రాక్షసమార్గమున సుభద్రను అర్జునుఁడు కొంపోయిన నాఁటనుండియు యాదవులకు పాండవులపై పగ మెండగ్యెను. అట్లగుట కృష్ణుఁడు బహిరంగముగ పాండవపక్ష మూనుటకు జంకుచుండెను. ద్రుపద, విరాటుల నగౌరిసరులుగఁజేసిన చో వారెక్కుడు శ్రద్ధతో పాండవపక్షమూనిపోరుదురు. కృష్ణునకు యాదవులలో పలుకుబడియు గౌరవమును నానాఁటికి సన్నగిలుటనుగాబోలు, 'విధిలేకుండిన తుట్టతుదకు తనసహాయ్యము పాండవులు వేఁడుదురుగాక' యనిచెప్పి శ్రీకృష్ణుఁడన్నదమ్ములతో నటనుండి కదలిపోయెను.

తమబలసంపత్తుల అభివృద్ధికిఁదోడ్పడని కార్యములయందు కృష్ణుఁడు జోక్యముకలిగించుకొనుటకు యాదవు లంతగ నిష్టపడ

కుండిరి. తత్కారణమున శ్రీకృష్ణుని లోకహితైకకార్యములు కూడ వారల కంతగ రుచింపకుండెను. అంతకన్న నూదవ్వుల దుశ్చేష్టలు కృష్ణునకు రుచింపకపోయి యుండును. పెరటి చెట్టు సత్త్వము గ్రహించి ఔషధముగ నుపయోగించువా రరుదు గదా!

---

# మహాభారత యుద్ధము

## (i)

### — యుద్ధప్రయత్నములు —

—————:o:—————

ఏనాఁడు పాండవేయులు విరటుపురంబున నుండినట్లు దుర్యోధనునకు స్పష్టపడియెనో ఆనాఁటినుండియునాతఁడు యుద్ధ సన్నద్ధుఁడు గాఁజొచ్చెను. యుధిష్ఠిరుఁడుకూడ, ద్రుపదపురోహితుని దుర్యోధనుకడకు, 'రాజసూయయాగము నాఁటికి దమకున్న రాజ్యభాగమియ్యవలసిన'దనివర్తమానమంపియు, సైన్యముల సమకూర్పప్రారంభించెను. దీనిఁబట్టి యిరువాగులవారును యుద్ధమునిశ్చయించుకొనినట్లు కాన్పించును. ఆర్యావర్తమందలి రాజుల సహాయముకోరి ఉభయపక్షములవారును దోడాసపడి దూతల నంపుకొనిరి.

సకలరాజన్యసామాన్యంబుగా గోపాలదేవుపాలికి దూతంబుచ్చుట తగవుగాదని తలంచి సుయోధనుండు తానే స్వయముగ నాతనిపిలువనరిగెను. ధర్మజుఁడు అర్జును నంపెను. వారిరువురు నొకేసమయమున ద్వారకకేతెంచిరి. దుర్యోధనుఁడు కృష్ణుని చనకుసమానుఁడుగభావించెను. ఆతనికడనుండిన పశుబలమునాసించి, యుద్ధమునకాహ్వానింప నేతెంచెను. ఇంక నర్జునుఁడన్ననో శ్రీకృష్ణుని బుద్ధియు తమ సమస్తపురుషార్థములకు

మూలమ్ముగా భావించి యాతని భగవంతునిగా నెంచి పూజించు చుండెను. ఏ రిపువుర మనోభావంబులఁ గుర్తెఱింగియే కృష్ణుఁడు తనకున్న పశుబలమును ఆత్మబలమును రెండుభాగములుగ నొనర్చెను. ఆభాగము లెవ్వియన:- "ఊరక నిరాయుధ వ్యాపారతమైనుండు నేనొకవైపునను, ఇంకొకవైపు:

"నాపాటియె పదివేవురు
గోపాలురు గలరు సమరకోవిద బాహా
టోపాభిరామమూర్తులు
చాపాద్యాయుధ కళావిశారదచిత్తుల్."

అని కృష్ణుఁడు పలికి, వారలతో ఎవరికి కావలసిన భాగమును వారుగైకొనుఁడని చెప్పెను. బలరామాదులకు శ్రీకృష్ణుఁడు పాండవపక్షపాతిగ గాన్పింపకుండుటకై కౌరవులకుకూడ కొంత బలమిచ్చి పంపెను. ఇదిగాక అపరిమితబలగర్వితులైయున్న యాదవులకడ తనమూలబలమగు 'నారాయణగోపాలు' రుండిన తనయనంతరము యాదవులు లోకోత్పాతముల గలిగింతురను భీతిచే తనమూలబలము కౌరవులకిచ్చి అద్దానిని అర్జునుచే నిర్మూలింపఁజేయ నిశ్చయించియుండనోపు. ఆత్మబలమధికమైన శ్రీకృష్ణునకు పశుబలముపై విశ్వాసమంతరించుటచే నద్దాని నాసించిన దుర్యోధనునకిచ్చి, నిరాయుధవ్యాపారతనుండ నిశ్చయించిన తాను రణంబునకు సహాయుంబొల్లని అర్జునుచెంతఁ జేరెను. అర్జునకోర్కెదీర్చుటె తనవ్రతంబగుటను, దానిడిన భాగంబులలో, చిన్నవాఁడను మిషమీద అర్జునునే మొదటవం

తెత్తుకొమ్మనెను. మహాబుద్ధిమంతుఁడయ్యును శ్రీకృష్ణుఁడు ప్రమాదమువలన ప్రళయము సంభవించునను భీతిచే కావలయు నేదో కారణము కల్పించి, అర్జునుడే ముమ్ముందు వంతునెత్తుకొన వలెనని సిద్ధాంతపఱచెను.

శాపదగ్ధక్షత్రియవంశమగు యదువంశమున నుద్భవించిన వీరుఁ డగుటచేఁ గాఁబోలు శ్రీకృష్ణుని సుయోధనుఁడు దనపక్షము నకు గైకొనుట కంతగ నాసింపలేదు. కృష్ణునియెడ నాతనికి భక్తికన్న భయ మెక్కుడుండెను. శల్యునితో:

క|| సత్త్యసరస్వతి వగు మా,
చిత్త్య విశారదము నీదుచిత్తము నియమా
దాత్త్యంబు మెఱయ నాకున
మాత్యుఁడవై ప్రోని నడెపు మత్సైన్యంబున్||

అని యాతనిఁ బ్రార్థించిన దుర్యోధనుఁడు, శ్రీకృష్ణునికడ నప్పు డిట్లనియె:

ఉ|| "  *  *  *
* గయ్యము సేయువగన్ సహాయమున్
గోరి ధవత్సకాసమునకుం జనుదెంచితి *  *  * "

అనిమాత్రమే చెప్పెను—దుర్యోధనుఁడు, శల్యునితో

ఉ|| "  *  *  *  నీవు స
మ్మానముసేసి నాకిటు లమాత్యుఁడవైనపదంబు కంటె మే
లై నుతికెక్కు కోర్కె యొటులారసి చూచివనొండు గల్గునే!"

అని పలికెను.

అట్లగుట దుర్యోధనునకు శల్యునిపైనున్న గౌరవమున సహస్రాంశమైనను కృష్ణునియెడ లేనట్లు స్పష్టపడు చున్నది కాదా!

> "వివిధోపాయ పరాయణుండు, రిపువర్గోర్వ్యపహారక్రియా
> ప్రవణోద్యోగుఁడు మంత్రరక్షణ కళాపారీణ్యగణ్యుండు దై
> ర్యవివేకాది గుణోత్తరుం డఖిల విద్యాజాల సంవేది * *"

అని పెక్కురుపెద్దలచే కొనియాడఁబడిన శ్రీకృష్ణుని మాహాత్మ్యము గుర్తెఱుంగలేని దుర్యోధనుని రారాజపదవి యందుంచినచో నార్యావర్తమునకు భావిభాగ్యము సమకూడు టెటుల? మానవకోటికి మంగళముఁ జేకూర్పనవతరించిన మహా పురుషుఁడు, దుర్యోధనాది దుష్టచయము వారియాటల నార్యా వర్తమున సాగనిచ్చునా!

దుర్యోధనుఁడు శిశుపాల నరక, జరాసంధ, కంసులంతటి— లోకకంటకుఁడు కాకుండినను, అతఁడు రజోగుణప్రధానుఁడై సాత్త్వికులగు పాండవుల కెన్నియో యపకృతులు కావించుటచే శ్రీకృష్ణుఁడు, ఆసురవృత్తుల నడంచినటులనే, దుర్యోధనాది దుష్ట నృపులను లోకకల్యాణముకొఱకు నిర్మూలింప నిశ్చయించుకొ నెను.

—

## (ii)

### — ద్రుపదపురోహిత దౌత్యము —

పాండవులకడనుండి కౌరవులకడ కిరువురును, కౌరవులంప పాండవులయొద్ద కిరువురును దూతలుగ వచ్చిరి. వీరిని మనవారిపుడు రాయబారులనియు వారొనర్చిన దౌత్యమును రాయబారమనియు ననుచు, పెంచి పెద్దగ్రంథముల వ్రాయుచున్నారు. అందు మొదటివ్యక్తి ద్రుపద పురోహితుఁడు. ఈతఁడు హస్తినాపురమునకేగి పాండుభూపాలు ధరణీ భాగమంతయు పాండవులకీవలసినదని నుడివెను. దౌత్యమొనరింప బయనమై వెడలిన పాంచాలపురోహితుఁడు మగిడి రాకపూర్వమే పాండవులు ఆర్యావర్తమునందలి సకలరాజన్యులకడకును తమదూతలనంపి రాఁబోవు కయ్యమునకు వారివారి సహాయ్యమపేక్షింప మొదలిడిరి. ప్రబలవిరోధియగు ద్రుపదునిపురోహితుఁడు దూతగ వచ్చుటచే కౌరవులలిగి యుద్ధ్యాది కయ్యమునకు కాలుద్రువ్వుటగ భావించిరి. అందుకుదోడుగ, ద్రుపదపురోహితుఁడు 'శ్రుతికిఁబరుషంబైన' వాక్యముల ధార్తరాష్ట్రుల నాడిపోసెను. ఇంతలో పాండవులొనర్చుచుండిన సమరసన్నాహంబుల వార్తాహరులనుండి వినిన దుర్యోధనుండు పాండవులకు సూదిమొన మోపునంత నేలనైన నీయకుండుటకు నిశ్చయించుకొనెను.

---

## (iii)

### — సంజయ దౌత్యము —

భీమసేనాదులవలన తనపుత్రుల కపాయముశంకించియు, సుయోధనుని సంకల్పము మరల్ప నసమర్థుండగుటను, ధృతరాష్ట్రుఁడు సంజయుని పాండవులకడకంపి వారలనెటులేనియుకోపోపశాంతులఁగావించి రణమునకు రాకుండఁజేయ బ్రయత్నించెను. 'శుష్కప్రియములును, శూన్యహస్తములును' అగు సంజయుని దీర్ఘసంభాషణ విని ధర్మజుఁడు భీతినొంది కావలయు, తమకు ఇంద్రప్రస్థముగాని యింకే యూరునుగాని యొసంగినఁ జాలునని యనఁబోయెను. అప్పట్టున నచ్చో విచ్చేసియున్న కృష్ణుఁడు ధర్మజుని చిత్తవృత్తి గ్రహించి పాండవుల బలసంపత్తిని పొగడెను. యుధిష్ఠిరుఁడంతఁ గొంత శాంతచిత్తుఁడై కలఁతఁదేరి దనరాజనీతి నైపుణ్యమంతయుఁ దెల్లమగునట్లు సంభాషింపుచు కౌరవసామ్రాజ్యమున కాయువుపట్టులుగ నుండిన కుశస్థలి, వృకస్థలి, మాకంద, వారణావతంబునుఇంకనైదవదిం కెందైనను సరియే, యీయవలసి యుండునని చెప్పెను. పాండవులు ప్రాణతుల్యముగ ప్రేమించిన ఇంద్రప్రస్థమును ఇప్పట్టున యుధిష్ఠిరుఁడు విడిచిపుచ్చుటచే తననిర్మోహత్వము వెల్లడించెను.

అనుద్దిష్టముగనాతఁడా ప్రదేశములనాశించియుండలేదు. పౌండ్రక వాసుదేవునితో శ్రీకృష్ణుఁడు పోరనేతెంచిన సందెఱింగి కర్ణుఁడుయాదవులనోడించి గైకొనినది కుశస్థలి. ఆనాఁటిద కర్ణుని

యనుభవమునందుండెను. కుశస్థలికో లేకపుట కృష్ణుని ప్రక్కలో బల్లెమట్లు మెలఁగుచుండెనని యనఁదగియేయున్నది. మాకందియు పాంచాలురపట్లె నట్టిదియే. ద్రుపదునోడించినప్పుడాతనివలన కౌరవులు నష్టపరిహారముగ పుచ్చుకొని ద్రోణునకిచ్చియుండినది మాకంది. వృకస్థలి, వారణావతములు పేర్కొనుటచే పాండవులు తాముబడినబన్నములు—అనగా,విషభోజనము; లాక్షా గృహదహనము— మరువలేదని తెలియఁబఱచిన ట్లయ్యెను. ఇంక నైదవది ఎచ్చోటనుండినను సరే యనుటలో తమపడిన బన్నములు సర్వదేశ విఖ్యాతములనికూడ నుద్దేశించి పలికెననియననగును.

తమపక్షమూని వచ్చిన యాదవులకును పాంచాలురకును సంతోషము కలిగించుటయేగాక, తానడిగిన ప్రదేశముల నిచ్చినచో, నయ్యవి కౌరవవీరులగు కర్ణ, ద్రోణ, కృపుల కెంతయో ఖేదము గలిగించి వారిని దుర్యోధనుపక్షము వీడజేయునని ధర్మజుఁడుద్దేశించి యుండెను. ధర్మజు మతము బాగుగ గుర్తెఱింగియే కానోపు శ్రీకృష్ణుఁడు పాండవదూతగ కౌరవసభ కేగినప్పు డన్నిటికన్న భేదోపాయంబునే యెక్కుడుగ నుపయోగించి కౌరవులలో కలతల జనింపఁజేసి మఱలివచ్చెను.

అడిగినదిమాత్ర మల్పమే. అర్ధరాజ్యమునకు బదులు మారుమూలలనుండిన ప్రదేశములఁగోరెను. కాని వానినొసంగ దుర్యోధనుఁడు సంసిద్ధుఁడైనపుడు కొంప లంటుకొనును. కౌరవ

సామ్రాజ్యమున కలతలుజనించినంత, సామ్రాజ్యము గుభిల్లునఁ గూలును-ఇంతకును, సంజయుఁ డెవరు? దూత. ఆతనిపలుకుల వలన కార్యము కొంతయైనఁ జక్కఁబడలేదుగాని, కౌరవులకు క్రౌర్యముమాత్రము హెచ్చెను. శ్రీకృష్ణునకు కావలసినదిగూడ నింతియే !

కాని ధర్మజుఁడు శ్రీకృష్ణునితో చెప్పినట్లు:

క॥ మమ్మెఱుఁగు దదరి నెఱుఁగుదు,
నెమ్మియెఱుఁగు దర్థసిద్ధి నెఱి యెఱుఁగుదు, వా
క్యమ్ముల పద్ధతి నెఱుఁగుదు,

*    *    *    *

ఇట్టిఁ దగుటనేగద యీకార్యనిర్వాహణార్థము గురుసభకు యుధిష్ఠిరుఁడు గృష్ణు నంపవలసివచ్చెను.

## (iv)

## — శ్రీకృష్ణుని దౌత్యము —

తరువాత శ్రీకృష్ణుడు పాండవుల రాయబారిగ కురు సభకేతెంచెను. దుర్యోధనాదులు తనమాట వినరని నిశ్చయముగఁ గృష్ణుఁడెఱుంగును-వారినట్టి స్థితికిఁ దెచ్చిన పిమ్మటనే, తాను పాండవులపై నిందఁబాపుటకు రాయబారము పేరిట హస్తినాపురమున కేతెంచెను-పాండవులకు మాత్రము ధర్మజుని మతము ననుసరించి, యుద్ధముచేయకుండగనే రాజ్యముపాలు రాఁబట్టుకొనవలెనను కోరికయుండెను. వారు మాత్సర్యము వీడి గతములను మరచిపో నిశ్చయించుకొనిరి.

తే॥ "అలవి యెఱుఁగక ధార్తరాష్ట్రులు గడంగి
మమ్ము బఱచిన పాటులు మానసమునఁ
జవుబఁబెట్టిన విత్తుల చందమొంది,
యంకురింపక చెడిపోయె నంబుజాక్ష."

క॥ "కడవఁగ నొకళ్లు పసరము
నడిచిన నొక్కళులుఁ బెయ్యి నడువవలయునే
చెడుతెరు వాకౌరవ్యుల
కడనిలుమంగాక మనకుఁ గ్రౌర్యంబేలా!"

అనుమతము ననుసరించి పాండునందను లుండిరి; కాని కృష్ణుఁడు మాత్రము, వృకోదరుండును, వివ్వచ్చుండును తోడు

గాఁగ దురాత్ములగు కౌరవుల రూపుమాపి ఆర్యావర్తమునం తకు ధర్మజునిబట్టముగట్ట నిశ్చయించుకొనియుండెను. అందునకు జనవంద్యుఁడగు ధర్మసుతుని యాజ్ఞ అవసరము. 'పాండవ కౌరవుల్ గలసి పాలును నీరును బోలె నెమ్మిమైనుండెఁ' జూచిన ధర్మజుఁడు కులక్షయకార్యమున కనుమతించునా? కాని కృష్ణుఁడు మాత్రి మెట్టులనైన రిపుక్షయంబుఁజేసి పాండు కుమారుల నార్యావర్తమున నధిక విభవోపేతులఁజేయ నిశ్చయించెను. రాజసూయమునాఁటి కార్యావర్తమున నిరంకుశుఁడుగ నుండిన జరాసంధుని సంహరించుటకు ధర్మజుని ఆజ్ఞపై భీమార్జునుల వెంటనిడుకొని వెడలెను. కాని నేఁడట్టి కార్యమునకు ధర్మజుఁడియ్యకొనవలెనుగదా! ఆతఁడు "కులక్షయముకాకుండ కార్య మేవిధినైనఁజక్కఁబడుట యెంతయు నొప్పు" నను నభిప్రాయముతో నుండెను. కావున ధర్మనందనుని మనంబునిశ్చింతంబొనర్చుట కృష్ణునకు మొదటికర్తవ్యమైయుండెను.

శ్రీకృష్ణుఁడు పాండవపక్షపాతిగనుక,—రాజు బెడిదంబులు వల్కిన నచ్చోఁతగవులు వచ్చు నని ధర్మజుఁ డెఱుంగును. కాని ముష్కర దుష్కర్ములగు కౌరవుల సభకు అసహాయశూరుఁడగు శ్రీకృష్ణునితప్ప యింకొకనిని పంపుటకు ధర్మజుఁడు సాహసింపలేదు. ఆకారణముననే గదా,

తే॥ "కుటిలమతు లనీతులు క్రూరకర్ము
లట్టినీచుల కడకు ని న్ననుపఁజాల

నీవు సంకటపడియెడు దేవపదవి
యైన నే నొల్ల నొంటి యందరుగు టుడుగు."

అని ధర్మజుం డనెను !

ధర్మజుని అనుమానమువాప కృష్ణుండు ధైర్యముగ:—

చం. " * * * ఏను నిక్క మ
గ్గిన నవటం గలం డె రణకేళికి మార్కొన నొక్కఁడేనియున్?"

అని పలికెనేగాని, పురుషప్రయత్నములందు మాత్ర
మాత్రఁ జెట్టిలోపమును చేయలేదు.

సాత్యకిని రావించి, యిట్లు చెప్పెను:—

కం॥ "మనప్రజలోఁ గగిపురికిం
జనుదేరఁగవలయు వారి సారణతో రం
డని యేర్పడ నియమింపు, ప
యనమై యేతెమ్ము నీవు ... ... ".

" దుర్యోధనుండు దుష్టాత్మకుం డతండు మన్నించు మాను
సులునుం గుటిలబుద్ధులు గావునఁ జక్రగదాద్యాయుధంబులు
రథంబునం బెట్టింపవలయు".

కృష్ణుఁ డిట్లు సాత్యకికి గట్టడి సేయుటయందే కౌరవులు
కయ్యమునకుఁగాలుద్రవ్వినచో తనకపుడు కావలసిన పరికరముల
సంసిద్ధమొనర్చుకొనియే కృష్ణుఁడు కరినగరమునకుపయనమయ్యె
నని సుబోధక మగుచున్నది. ఇం దీతని దూరదృష్టి విశద
మగుచున్నది కాదా! విజ్ఞానవంతుఁడగు వీఁ డెవ్వండును శత్రు

శిబిరంబునకు నిరాయుధుఁడై పోనోపఁడు. శ్రీ శివాజీఛత్రపతి బిజాపూర్ నుండి తనపై కరుదెంచిన అఫ్జుల్ ఖానుని, సంధికై కలిసికొన నేగినప్పుడు కవచము, ఖడ్గము, వ్యాఘ్రనఖములు నేమఱి యుండెనా?

శ్రీకృష్ణుండు తానుతప్పక సంధికావించుకొని వత్తునని చెప్పలేదు. 'రాజ్యము చవిగొన్నవారు పాలేల యిచ్చెద'రని యాతఁడు ధర్మజునితో స్పష్టముగపలికెను. అందుకుధర్మరాజుఁడు, "లోకంబెల్ల నేను ప్రకాశిత ధర్మస్థితి నున్నటుల నొప్పకొనిన నంతియుచాలు"ననెను కాని అర్జునాదులుమాత్రము'సంధియేల యగునంచున్ మున్నుకైపెక్కినట్టి తలంపు' మాని సంధికై ప్రయత్నింపుమని యాతని బ్రార్థింపకపోలేదు. కావున కృష్ణుఁడు తుదకు 'సంధికినోపినంత పురుషకార మొనర్పుట' కంగీకరించి యు తనదౌత్యమువలనవచ్చు పర్యవసానమును ముందుగ నిట్లు చెప్పిపోయెను.

———సుయోధనుఁడును ఆతనిమంత్రులును కుటిలమతులును, అవినీతులును అగుటను సంధికార్య వచనములు చక్కవిననీరు; నాపలుకుల కాతఁడు తెలుంగు మాలినమాటలాడును; మీతొల్లింటి పాట్లనుం దలంచి అవ్వోవిచ్చేసియున్న యెల్లవారును వారి నగర్హింతురు. కావున సంధిసమకూడకున్న నీవులోకంబు మెప్పవడయు నట్లొనర్చుటయైన నగుంగాక.

తే॥ "అసమయోధను ముక్కంటి నాఁడి గలుగఁ
బడమి నీ కీడుఁ గావునఁ బోర గలుగు;
నేను కయ్యపు శకునంబు లెన్ని యేనిఁ,
గంటి; నీ వను త్సాహివిగాఁగవలదు."

కావున సంధిపొసంగకున్నను, 'నచ్చోటి యుత్సాహంబు చందంబును, నందఱ జేయంగలవారివర్తనంబులుఁ గొలందులు నెఱింగి నీకు విజయంబగు విధంబునం జనుదెంచెద.'——— "శ్రీకృష్ణుం డిట్లనిన పిమ్మటనే గురుసభ కేతెంచె" ననుటచే శ్రీకృష్ణుఁడు రాయబారిగ నరిగె ననుటకన్న, దౌత్యమొనరింప నరిగెననుటకన్న, పాండవగుప్తచారుఁడుగ నరిగె ననుటయే యుక్తతమముగ నుండునేమో!

కౌరవబలమునఁ గలతల గల్పించి, భేదనీతి నెఱపి కార్యము సాధించుటయే శ్రీకృష్ణుని సంకల్ప మనుట స్పష్టము. మహాపురుషులు సంకల్పించినఁజాలు, కార్యములు క్రమపరిణామమును బొందును. కృష్ణుఁడు కరినగరముఁ జేరునంతలో కౌరవులలో నంతఃకలహము లుద్భవిల్లెను.

అతిలోభదూషితుఁడగు నావృద్ధరాజు అందఱను తన స్వభావమువంటి స్వభావముగలవారిగనే యెంచి, పాండవ దూతగ నేగుదెంచిన కృష్ణునకు వలయు వస్తువులనెల్ల లంచముగ నిచ్చి, వానిని తమపక్షమువానిగఁ జేసికొనినచో తనకొడుకులకు పాండవులవలని భయము లేకుండునని తలంచెను.

కం॥ "ఘనయింట సుయోధను గృహా
మున మన్నాసము నిక్కేముగ నెయ్యాడి నగా
అని మాటిక్కి కింపు వది యే
ల్లను గౌరవ మొప్ప నీవలయు మాన కెనఘా"

అని ధృతరాష్ట్రుఁడనెను.

కాని "పాండవులకు నేమగపడయూ కృష్ణుం బట్టి బంధించిన అెక్కలువిఱిగిన పులుఁగులుంబోలె వారు (పాండవులు) నాకు విధేయులగుదురు". అని సుయోధనుఁడు స్పష్టముగా పలికెను.

కౌరవుల కేడుగడయైన గాంగేయుఁడా పలుకులు విని, "ఆ మహాత్మునెడ నపకారంబు విచారించిన దుష్టా త్ములు నష్టాత్ములగుదురు. దీనం జేటువచ్చు" ననుచు మొగంబు గంటువెట్టుకొని దిగ్గనలేచిపోయె. కృష్ణుఁడు కరిపురమున కాలిడకముందే కౌరవులలో నిట్టిభేదాభిప్రాయములు పుట్టినవి.

ఇంకఁ గృష్ణుఁడెట్టి యేర్పాటులొనరించుకొని హాస్తినా పురికరుదెంచెనో చూతము:— పూర్వము తమ యనుభవము నందుండిన కుశస్థలమునందు కొండొకతడవుండి, అచ్చోనుండిన యాదవుల మన్ననలంది, తమవాఁడైన కృతవర్మతో సవిశేష స్నేహంబు సేసి, మార్గమధ్యంబున మహర్షులం గలిసికొని కరినగ రంబున కేతెంచెను. కురున్నృపుఁడంపిన కజ్జంబులును, బంధులను పుచ్చుకొని, వానిననుభవించినవిధంబునలిపి, యనుభవమొల్లక, ఎదురుగ నేతెంచిన విదురాదివిశిష్టజనుల బంధుదృష్టిఁజూచి,

పరిరంభసంభావనము లొనర్చి, రాజమందిరమునఁ గొండొక
సేపు నిలిచి, విదురు సదనంబునకుం జనెను. పుణ్యపరులు,
దోడఁబుట్టువు, లార్యులైన యత్యంతకే బాల్యమాదిగఁ గీడాచ
రించిన కౌరవు, లాపాండవులకుఁ బ్రాణమైన శ్రీకృష్ణుని కెట్లు
నేల తలంపరు! అందుచే తన్ను పైనతు ద్రోహిగ భావించి పూ
జించు విదురు నాతిథ్య మంగీకరించెను. విదురుఁడు దుర్యోధనా
దుల దురుద్యోగంబు లెఱింగిన వాఁడగుటఁ, బాండవేయుల దెసం
దనమైత్రి కతంబునను, శ్రీకృష్ణునియెడ భక్తికారణంబునను,
ఆతని కౌరవసభకుఁ బోవలదని బోధించెను. కాని కృష్ణుఁడు
తొల్లి ధర్మజునితోఁ బలికినట్లెన్ననే, విదురునితోఁ గూడ, 'నే
తలంచిన చందంబునఁ దులువలై వారు కలగం బాఱిన, నా ముం
దర నిలువం జాలుదురే!' అని యతిధైర్యముగఁ బలికెను.

ఇట్టు లననే గాని శ్రీకృష్ణునకు మనమున భయము లేక
పోలేదు. కంసుఁడు తనతండ్రికిఁ గావించినటులే, దుర్యోధనాదు
లు దన్ను కురుసభయందు బంధింతురన్న భీతి కలిగియున్నటుల
కాన్పించును. అందుచేతనే మఱుచటి దినమున నభ్యంతరులైన
బలుమానుసులను తోడవిక్కొని, విదురు కరమును, తమ్ముచే
యియు, చెరియొక హస్తంబున బట్టుకొని దుర్యోధనుఁడున్న
కొలువు కూటమున కేగెను. ఆ సభయందు సాత్యకియు, కృత
వర్మయు తన్నంటి యిరువంకలఁ గూర్చుండఁ బెట్టుకొనెను.
అంతతో చాలక విదురుని తనకు వెనుక దెసనున్న యున్నత
పీఠంబునఁ 'గిరం బత్తికల్లి' గూర్చుండ నియమించెను. ఇట్లు

చ॥ "మదమడంగించి భూపతి సమాజము నెల్లను నిన్నుఁగొల్వఁ జే
యుదునని పూని దిగ్విజయ మున్నతిఁజేసి మహావిభూతితో
మదిమదినుండ, నీ సుతుఁడు మంత్రులు సౌబలు జూదమార్చి సం
పదగొని యంతఁబోవక సభన్ ద్రుపదాత్మజ భంగపెట్టరే!"

ఈమాటలలోనే తండ్రికొడుకులలో భేదము పుట్టింపఁ జాలు బీజము లున్నవి. అంతియేగాక శ్రీకృష్ణుండు ధృతరాష్ట్రుతో మఱియు నిట్లనియెను:

——నీకు మహావిభవము సేకూర్పఁజూచిన ధర్మజుతో సుయోధనుఁడు జూదమాడి యాతని బలవద్విరోధిగఁ జేసెను. నీకు మహావిభూతియే కావలసియున్న నయ్యది రాజసూయాధ్వరకర్తయైన ధర్మజుని వలననే రాఁగలదు. కావున నీవు లోభ ముడిగి పాండవులఁ దెమ్ము.——

ఆ మాటలపై సచ్చోవిచ్చేసియున్న మునిముఖ్యులు, ద్రోణభీష్మాదికురువృద్ధులుగూడ నటుల నేయనిరి. మఱికొందఱు మునీంద్రులు కొన్నికథల నల్లి దుర్యోధనునందు దుర్మానమును దుర్బుద్ధియుఁగూడ నారోపించి యాతని నుద్రేకింపఁజేసిరి. కాని యారాజరాజతి శాంతతతో వారి కిట్లనియె:

క॥ "మునులార నన్ను విఁకి రేసి
నాని మునుపుట్టించె నట్టిలయ్యోదుఁ గా కీ
వినఁజనిగాని పలుకులఁ
బని గలదే? యుఁకుగఁ జింక బహుభాషణముల్"

మహామానియగు దుర్యోధనుఁడు విధివెయిదముల కెక్కుడు ప్రాముఖ్యత నిచ్చి మాట్లాడుటచే సంధికి సమ్మతించు నేమోయని కృష్ణునకు భీతిపుట్టినట్లు కాన్పించును. కానున్న వెంటనే ఓదార్చునట్టియు, వాఁతపెట్టునట్టియు ప్రసంగము ప్రారంభించు వేల!

————పాండిత్యశౌర్యనిత్యులు, పాండుసుతులు; వారిఁ గూడి బ్రతుకుట తెలుఁగు; కాని శకుని కర్ణదుశ్శాసన దుర్మంత్రి తంబున కార్యతంత్రంబు కానేరదు. వీరెకాదు సురాసురులెత్తి వచ్చినను పాండవేయుల మారొ్కనఁజాలరు. సవ్యసాచి కెదురుగ నిలువఁజాలిన వీరుఁడుండిన కయ్యమునకు పూనుకొనుఁడు. లేకున్న రిత్తగ బహుజనక్షయము వలదు————
అనిగదా యని యెను!

ఎందుకీ పుల్లవిఱుపు మాటలు? ఎట్టివాఁడైననిట్టి పలుకు లకుఁగనలకుండునా? ఈమాటలు రజోగుణపూరితుఁడైన రాజ రాజు కోపానలంబున కింధనంబు లయ్యెను. అతఁడాదినుండియు తనకడనున్న కర్ణుఁడు అన్నిటనర్జునునకుసరియగునని నమ్మియుం టి, సవ్యసాచి నెదురొ్కనఁజాలిన వీరుని వెదకుకొన నక్కర లేకుండును. కావున వెంటనే దుర్యోధనుఁడు యుద్ధము సిద్ధ మొనర్చి ఖచితముగ నిట్లు పలికెను: 'ధర్మపుత్రుండు జూదరి యగుట భూమిని గోల్పోయె. మా కురుపురిలో నెవ్వరైన సంగ్రామమున జయంబుగొని రాజ్యముచేయుటయే నేను నిశ్చయించితి?'

అంతమాత్రమునకు — శ్రీకృష్ణుండు పుండరీకాక్షుఁడగు టల్లబోయి, అరుణకమలాక్షుఁ డయ్యె — నట! శ్రీకృష్ణునకు కావలసినటులనే జరిగెనే! కావున నాగ్రహమునకు కారణము కాన్పింపదు. కాని తానటుపిమ్మటనాడిన నానాప్రకార వచనంబులఁ గరుణకమలాక్షుఁడగుట యవసరమని ఆరీతి నభినయించి యుండనోపు. శ్రీకృష్ణుండాడిన యప్రస్తుత పరుషవచనంబులకుఁ గటకటంబడి దుర్యోధనుండటనుండి రాజసమున దగ్గన లేచిపోయెను. ఆతనివెనుక కర్ణుండు ననుజగణంబును వారిపొందైన జనపతులును బోయిరి. అంత కృష్ణుండు సందెలించి మిగిలిన సభాసదులం గాంచి యిట్లనియె.

ఉ॥ "కంసుఁడు నిట్లు తండ్రి మదిగందెడు చందమొనర్చి ధర్మవి
ధ్వంసము చేసినం గులమువారలు నాకెఱింగింప* నేను దు
ర్మాంసము గోయువైద్యుని క్రమంబున నాతని ద్రుంచి యస్వరో
త్తంసముఁ జేయనే జనకుఁ, దద్విధ మెప్పుడు మీరుఁ జేసినన్"

ఈ విప్లవప్రబోధము, పాండవులకు రాజ్యము రాఁబెట్టు మార్గము గాఁబోలు! భేదోపాయ ప్రయోగమున శ్రీకృష్ణుండద్వితీయ కౌశలము కనపరచెను — పాపము! ధృతరాష్ట్రుఁడు కృష్ణుని పలుకులఁ గదరిపడి, మతిచెడి, మంతనంబునకు విదురునంపి గాంధారిం గొనివచ్చెను. ఆమె చెప్పినను దుర్యోధనుఁడు వినలేదు. ఆతఁడు కృష్ణుని కుతంత్రంబున కలిగికావలయు నాతనిఁబట్టి కట్ట సంసిద్ధుఁడయ్యెను. కృతవర్మ దీనింగాంచి యాదవబలములఁగొని

* ఆకులమున నెవ రెపుడెఱిగింపఁగా ;

వచ్చి సభాభవనమున కావల యుద్ధమునకు సిద్ధుఁడైయుండెను. సాత్యకియుఁదానొక్కండె—లోఁపలికి నెల్లఁజాలుదు—నని యెల్ల విధంబుల నప్రమత్తుండయి యుండెను. శ్రీకృష్ణుండంతట దండోపాయముకూడ నవసరమైన నదిప్రయోగింపఁగల సామర్థ్యము తనకున్నదని యంద ఱెఱుంగునట్లు ధృతరాష్ట్రు నుద్దేశించి యిట్లనియె:

ఉ॥ రోషము నాపయింగలిగి కార్యింతేఁ గౌరవు లింత నేఁటి సం
తోషము; నీవు ప్రార్థనముతోఁ బగనాకు ననుజ్ఞ యిమ్ము, ని
ర్దోషత నేను నొప్పుగతి దోర్బల దుర్జయులైనవారి వి
ద్వేషముఁ జక్కఁజెట్టి జగతీవర! యంతిపపోయి వచ్చెదన్.

శిశుపాలుఁడు కాదు సుయోధనుఁడు! అనఁగలమాట యనెనేగాని కృష్ణునకు భీతిమాత్రముపోలేదు. సుయోధను బలసంపత్తుల బాగుగ నెఱుంగుట నటనున్నవారిని తనమాటలతో మైమఱపింపఁజేసి అవ్వలికేగ నిశ్చయించెను. తనకట్టెదుటనున్న యక్కురుపతి కుమారుఁ జక్కఁజూచి,—ఏనొక్కరుండ నని తలంచెదు. నా పార్శ్వంబుల సింద్రయమవరుణకుబేరు లుండుట ఎఱుంగవు. నాకు బాసటయై యదువృష్ణి భోజాంధక వీరులున్నారు. వాల గాండీవ బాహులగు బలదేవార్జునుల బలంబెఱింగి వర్తింపుము. యుధిష్ఠిరభీమనకులసహదేవులు నావీఁపున నున్నారు——అనిఅట్టహాసంబుగనాడిన ఆగంభీరవచనంబులకు దుర్యోధనుండు కొంతవడి చేష్టలు దక్కి యుండెను. ఆ సందెఱింగి కృష్ణుండు

సన్నిహితులైన కృతవర్మకరంబును సాత్యకి హస్తంబును నవలంబించి, సభవీడి, చివ్వున నవ్వలికేగెను.

తండ్రియగు వసుదేవునికన్న శ్రీకృష్ణుండు కడునేర్పరి. కంసుఁడు వసుదేవునిఁబట్టి చెఱఁబెట్టినట్లు దుర్యోధనుఁడు కృష్ణుని బట్టి బంధింపఁజూచెను. దుర్యోధనుని దురుద్యోగంబు శ్రీకృష్ణుండు విదురువలన మున్ముందు వినియుండుటను కావలసిన సన్నాహంబు లొనర్చుకొనియే కౌరవసభ కేతెంచెను. తనకు మూఁడ నున్నముప్పు, మాటలచేతప్పకున్న-చో నాతఁడు పోటునకుఁగూడ సన్నద్ధుఁడైయుండెను. శ్రీకృష్ణునిదూరదృష్టియు, మనోధైర్యమును, వాగ్గాంభీర్యమును నాతనినప్పట్టునఁ గాపాడినవి. 'శ్రీకృష్ణుని బుద్ధియ మాసమస్త పురుషార్థమ్ములకు మూలంబు' అని యుధిష్ఠిరుఁడు విశ్వసించినటుల, కృష్ణుఁడు తనబుద్ధి చాతుర్యముచే కౌరవవీరుల మనంబులఁ గావలసినంత కలవరము జనింపఁజేసి వచ్చెను. బాహ్లీక భీష్మ ద్రోణ కృప ప్రముఖ నిఖిల విశిష్ట జనంబులను పాండవపక్షపాతులుగ నొనర్చెను. దుర్యోధనుని ప్రాణమిత్రుఁడైన కర్ణునితో నాతఁడు పాండవాగ్రజుఁడని చెప్పి, ఆతని మనంబున పాండవులపై అభిమాన మంకురింపఁ జేసెను. అందుచే నాతఁడు మనఃపూర్వకముగఁ బాండవులఁదెగనేయుటకు వెనుదీయక తప్పదు. అంతకన్న పాండవుల కెక్కుడు ఉపకార మొనర్చుటకు కర్ణుని అంతరాత్మ యియ్యకొనకుండెను. ఆప్తుఁడైన సుయోధనుని నాపత్సమయమున వీడి చనుట కాతఁ డంగీక

రింపలేదు. శ్రీకృష్ణునిమాటలవలన కౌరవులు తప్పక గెలుతు రన్న విశ్వాస మా వీరాధివీరుని బాసిపోయెను.

కం॥ "అనుజులు బుత్విజులుగ నీ
పనియిటు సేయఁ గాని నీ వుపద్రష్టవుగా
విను కురుకుమార పశువిశే
సనమున రణయజ్ఞ మరేఁడు (ధర్మజాఁడు) సమ్మతిఁ జేయున్"

ప్రబల విరోధియగు కర్ణుని నిర్వీర్యు నొనర్చుటకన్న పాండవుల పురుషార్థమింకేమున్నది ?

అంతతో పోయెనా! శ్రీకృష్ణునిమాటలమాహాత్మ్యమింకనుజూతుముగాక:—ఆతఁడు వెడలిన పిమ్మట భీష్ముఁడు కౌరవ వీరుల నిరుత్సాహులఁ జేయనెంచి, దుర్యోధనుఁ డతిరథుండనియు దుశ్శాసన శకునులు సమరథులనియు, కర్ణుం డర్ధరథుండనియు, నిరూపించుటచే, రాజరాజు సన్మానము నాగ్రించి విజృంభిఁగుచున్న కౌరవవీరులు,నిరుత్సాహులైరి. యుద్ధప్రారంభసమయ మాసన్నమైనది, ఒకరిచావున కింకొక రెదురుచూచుచుండిరి. అంతః కలహము లారంభమైన తరువాత నపజయమున కాలస్య మేల యుండును? భేదోపాయప్రయోగకుశలుండగు కృష్ణుని దౌత్య ఫలితము లివ్వి. ధర్మజునకు విజయంబగు విధం బంతకన్న వేఱెయ్యది !

———

# శ్రీ కృష్ణుఁడు — గీతలు

## ( i )

### — పార్థసారథి —

ఆనాఁడు:

కం. "దేవేంద్రుని ఖాండవమును
    పావకునకు నీఁ దలంచి పార్థుని రథికుం
    గావించి సూతుఁడయ్యెను
    గోవిందుఁడు మఱఁదితోడి కూరిమి మెఱయన్."

ఆ కూరిమి నాఁటినుండియు నభివృద్ధిఁజెంది, పాండవులు నేఁడు పౌరరాజ్యంబునకుఁ బట్టముఁగట్ట శ్రీకృష్ణుఁ బ్రోత్సహింప, నాతఁడు మరల పార్థుని రథికుం గావించి, దా సూతుఁడై కురుక్షేత్ర రణరంగమున దర్శనమిచ్చుచున్నాఁడు.

శ్రీకృష్ణుని మాహాత్మ్యమంతయు మహాభారతయుద్ధమందే చూపఁబడెను. భగవద్గీతలు, బాహ్లీకసోమదత్తుల మరణము, సైంధవవధ, అభిమన్యునిచావు, ఘటోత్కచునిమరణము, ద్రోణుని అస్త్రసన్యాసము, కర్ణునిఅంతము, హ్రదంబున డాగిన దుర్యోధనుఁ బిలిచి భీముచేచంపించుట, ఉత్తరాగర్భ సంరక్షణము నిట్టివన్నియు శ్రీకృష్ణుని ప్రసాదములే. కేవలము పగ్గముల చేఁబూని పార్థుని యశ్వంబుల నదల్చుట కితండుండలేదు. పంచేంద్రియంబులఁ బాలించు ప్రాణంబువగిది పాండవులొనర్పవలసిన అన్ని కార్యములను, పార్థరథమునొగలపైఁదానుండి శ్రీకృష్ణుఁడే

నిశ్చయింపుచుండెను. నీతులు చెప్పుటకు, గోతులు త్రవ్వుటకు, నిందలు రాకుండ బంధునాశ మొనర్చుటకు, ధర్మజుఁ డాతని మాటపై నడచుచుండెను.

కురుక్షేత్ర రణరంగమున శ్రీకృష్ణుఁ డర్జునునకు కావించిన ధర్మోపదేశము ననుసరించియే అతనికి భగవానుండను బిరుదము కూడ వచ్చినది. పగ్గంబులఁ జేఁగొని శ్వేతాశ్వంబుల నాల్గింటిన డుపుచు నరునిరథంబుపైఁగూర్చొనిన శ్రీకృష్ణుఁడు దివ్య కళలతో వెలుగొందుచు భక్తాగ్రేసరులకన్నుల, కానాఁటికే కాదు, ఈనాఁటికిని, కాన్పించుచునేయున్నాఁడు. శరతల్పశాయి యైనభీష్ముఁడు శ్రీకృష్ణుని ప్రార్థించుచు పలికినపలుకులఁ బరిశీలింతుముగాక !

కం॥ " పనవారిఁ జంపఁజాలక
వెనుకకుఁబో నిశ్చయించు విజయుని శంకన్
ఘన యోగవిద్యఁ బాపిన
మునివంద్యుని పాదభక్తి మొనయున్ నాకున్ "

ఉభయసేనా మధ్యంబున రథంబునిలుప శ్రీకృష్ణుని తత్తరించిన, యర్జునున కప్పట్టున ఘనమైన శంక లుత్పన్నమగుటయు, నాతఁడు గాండీవము దిగవిడచి నిలువున నీరై నిలుచుటయు నేలకలిగెను? పడినపాట్లఁదలంచి, దాయాదుల దునుమ నేతెంచినవానికి, పాపము, పరబలంబులు వీక్షించినంత ధర్మసందేహము లుత్పన్నములయ్యెను. 'బంధునాశము వంశక్షయము

కలిగించు కార్యముచేయుటకుజంకుపొడముచున్న'దనెను. అర్జునున కప్పట్టున సందేహములెందుకు కలిగినను, అయ్యవి, శ్రీకృష్ణునకు తన మాహాత్మ్యమువెల్లడింప మంచిసమయము చేకూర్చెను. వెంటనే మొత్తలపైనున్న కృష్ణుఁడు పార్థమోమున దృష్టినిలిప నరుని పుట్టు పూర్వోత్తరంబులఁజెప్పి, జీవుని యొక్క అస్థిరతయు, ఆత్మయొక్క స్థిరతయుబోధించి, అర్జునుని సంశయములఁ బాప మొదలిడెను. "ఫలిత మపేక్షింపక కర్మల నాచరించుటయే మనవిధి; పుట్టినవారందఱును గిట్టకమానరు. మనము కేవలము నిమిత్తమాత్రులము. కర్మల ననుసరించి కార్యములు జరుగుచుండును. నేను కర్త ననుకొనుటకన్న వెట్టివేఱులేదు. ఈశ్వరుఁడే మనచే నన్నికార్యము లాచరింపఁ జేయుచున్నాఁడు. కావలసినచో, కాలగతినొందనవారి మరణాంబునకు హేతుభూతులెవ్వరో వీక్షింపుము" అని శ్రీకృష్ణుఁడు తనమాటల చమత్కృతిచే నర్జునుని మనోవీథి ననేకాద్భుత దృశ్యముల నాట్యమాడించెను. తత్క్షణమే ఆ యతిరథశ్రేష్ఠుఁడు సంశయదూరుఁడై శ్రీకృష్ణునకు సాష్టాంగ నమస్కారము సర్వజనులు వీక్షింప నాచరించి, కార్ముకం బందుకొని కయ్యంబున కియ్యకొనెను. అస్త్రసన్యాస మొనర్చినవాని నాహవంబునకు సంసిద్ధునొనర్చుట శ్రీకృష్ణుని విశ్వరూపప్రదర్శనా ప్రభావమని చెప్పుదురు.

యుద్ధారంభమున శ్రీకృష్ణుని విశ్వరూప ప్రదర్శనమున కవసరములగు పరిస్థితులుండెను. శ్రీకృష్ణునిమొడ నెక్కుడు

గౌరవముండిన భీష్ముఁడు కౌరవసేనల కధిపతిగ నుండెను. ఇంక పాండవసేనలన్ననో, కృష్ణుని ప్రాణమిత్రుఁడగు అర్జునుఁడే నిజముగ నడిపించుచుండెను. 'పరభూపాయుపులెల్ల జూపులన శుంభత్కేళి వంచించుట' కింతకన్న తగిన సమయమెయ్యది? ఇరువాగుల నట్టి యభిమానవంతులుండుటచే శ్రీకృష్ణుఁడు నిరాటంకముగ నుభయసేనామధ్యంబున నిలిచి యంతనాటకమాడఁగలిగెను. 'ఎప్పటి కెయ్యది ప్రస్తుత మప్పటికా' కార్యమొనర్చు ఉచితజ్ఞుఁడు శ్రీకృష్ణుఁడనుటకు సందియము లేదు.

ఆనుషంగికముగా మరికొన్ని పరమప్రయోజనములుగూడ నాఁటిప్రదర్శనమువలనసిద్ధించెను. పదునెనిమిది అక్షౌహిణులును బదునెనమండ్రుమహారథికులును నున్నరణరంగమున, నతిరథశ్రేష్ఠుఁడైన అర్జునునిచేఁ భగవంతుఁడుగ పూజింపఁబడుటచే శ్రీకృష్ణునకు గౌరవమధికమయ్యెను ఆదృశ్యముమాత్రము పాండవయోధులకు ధైర్యమును, కౌరవపక్షమూని వచ్చినవారి కధైర్యమును, ఏకకాలమున కలిగించి, పార్థరథంబు రణరంగమున నిరపాయముగ నెల్లెడల విచ్చలవిడిగ విహరించుటకు వీ లిచ్చెను. యోధుల కెట్లుండినను, రణమొనర్ప నేతెంచిన జనసామాన్యమునకు మాత్రము శ్రీకృష్ణుండు భగవంతుండను భావముద్భవించుటచే వారు నరుని తేఱిపారఁజూడ వెఱచిరన నందసంగత మేమున్నది !

శ్రీకృష్ణుఁడు తనజీవితమందు ప్రధానముగ ముమ్మారు విశ్వరూపము చూపినట్లు కాన్పించును. కన్నతల్లికి పురిటింట

తనకున్న సృష్టిసామర్థ్యముఁ జూపి తరింపఁజేసెనట. కౌరవ సభయందు తన్ను కట్టవచ్చిన దుర్యోధనాదులకు దిగులు గొలుప తన వాసుదేవత్వము వ్యక్తపఱచెనట. కురుక్షేత్ర రణరంగమున నర్జునున కంకురించిన దిగులు వాప శ్రీకృష్ణుఁ డీశ్వరుని లయకాలరూపము నతిచమత్కారముగఁ జూపెను.

శ్రీకృష్ణుఁడు తనవిశ్వరూపము నింకను మఱికొన్నిపట్టులఁ జూపినట్లు భాగవతమునఁగలదు. అభీరబాలుఁడగు యుద్ధవుఁడు బాల్యమున కృష్ణునిరూపము గాంచి ధ్యానించుచుండ శ్రీకృష్ణుఁ డచ్చోటు బాసిపోయెను. కాని యుద్ధవుఁడుమాత్రము శ్రీకృష్ణుని మనస్సునం దుంచుకొని ధ్యానించుటచే ఆతనికి, లేని కృష్ణుఁ డున్నటుల కాన్పించెను. యశోదకు కూడ కృష్ణుఁడు తనబొజ్జ యందు విశ్వమంతయు కలదని నోరుదెఱచి చూపి ఆమెవలన దెబ్బలు తప్పించుకొనెను. అక్రూరుఁడు నీటియందును, రథము నందును, శ్రీకృష్ణు నేకమూహూర్తమునఁగాంచి భక్తిపరవశుఁ డయ్యెను. కృష్ణుఁ డొక్కఁడయ్యును గోపికలకు అనేకులుఁగ కాన్పించెను. కంసునకుఁ గూడ అంత్యదశయం దన్నిచోటులఁ గాన్పించె నందురు. ద్రౌపదికి వస్త్రము లసంఖ్యాకము లగుట కూడ శ్రీకృష్ణుని మాహాత్మ్యమే యట! ఇంతవఱకును భీతిచేత కొందఱకు, ప్రేమచేత కొందఱకు, కృష్ణుఁడు భగవంతుఁ డను భావ ముద్భవించెను. కౌరవసభయందును, కురుక్షేత్ర రణ రంగమందును, శ్రీకృష్ణుని విశ్వరూపప్రదర్శనా విధానములఁ గాంచినారము. ఇంకొక్క ఘట్టమందు మాత్రము శ్రీకృష్ణుఁడు

నిర్యాణమునకు పూర్వము భిన్నమగు విశ్వరూపముఁజూపెను. శ్రీకృష్ణుఁడు కౌరవులకుఁగావించిన అపకారమునకాగ్రహించిన ఉదంకుఁడాతని శపింపఁ జూచెను. కాని కృష్ణుఁడు తనమాటల మాహాత్మ్యంబున నుదంకుని వశపఱచుకొనెనేగాని ఈయుదంకునకు పూర్వప్రయుక్తంబులగు విశ్వరూపములలో నెద్దానినైనను జూపి నివ్వెఱపఱుపలేదు. అనువుగానిచోట నధికుఁడ ననుట కాతఁడిచ్ఛగింపకుండెను కాబోలు !

ఇఁకశ్రీకృష్ణుఁడు గీతలయందు బోధించినమతము పరిశోధింతము:

---

## శ్రీ కృ ష్ణు ని మ త ము.

శ్రీకృష్ణుని మహాత్మ్యమంతయు నాతఁడుబోధించిన గీతల యందేయున్నది. సృష్ట్యాదనుండియు మహాత్ములనేకులుద్భవించి మానవసంఘమునుసన్మార్గమున నడుపయత్నించిరి. వారలమార్గములు వేఱైనను గమ్యస్థానము మాత్రము వేఱుకాదు. శ్రీకృష్ణుని నాఁటికి ఆర్యావర్తమందు ముక్తిఁబడయుట కనేకమార్గము లవలంబింపఁబడుచుండెను. అందు భక్తి, యోగ, కర్మ, సాంఖ్యాది మార్గములు ముఖ్యములు. ఆర్యావర్తరాజకీయ నాట్యరంగమందుండిన వివిధ రాజ్యముల నంత మొందించి, ఒక్క మహాసామ్రాజ్యము పౌరవ్యుల యాజమాన్యమున నెలకొల్పినటులే, హిందూసంఘమందు వ్యవహరింపఁబడుచుండిన వివిధమతముల మార్గముల నేకమొనర్చి ఒక్కమతముగ నొనర్ప యత్నించెను. సకలమానవులకును పనికివచ్చు మతము నెలకొల్ప యత్నించిన మహాత్ములలో శ్రీకృష్ణుఁడు మొదటి వాఁడని చెప్పక తప్పదు.

— శ్రీకృష్ణుఁడు-అవతారపురుషుఁడా, కాఁడా?—అను సంశయ మనేకుల వేధించుచున్నది. అవతారపురుషుఁడనగా భగవదంశ అధికముగ గలవ్యక్తి యని భావింపవలసియుండును. ప్రతి మానవునియందును ఈశ్వరాంశ యున్నది. కాని అయ్యది కొందఱియం దెక్కువగను, కొందఱియందు తక్కువగను,

పొందును. ఎవ్వరు తమయందున్న ఈశ్వరత్వమును గుర్తెఱింగి అభివృద్ధికావించుకొందురో వారు కాలక్రమమున సంపూర్ణమగు ఈశ్వరత్వమును పొందుదురు. అట్లుకాక సాధారణ ప్రాపంచక విషయములందు నిమగ్నులై తమయందున్న ఈశ్వరాంశ గుర్తెఱుంగక ప్రవర్తించువారు కాలక్రమమున పశుప్రాయులై తమ మానవజన్మ వ్యర్థమొనర్చుకొందురు. శ్రీకృష్ణుఁడు తన స్వలాభమునకుగాక యాదవసంఘమునకును, తరువాత భారత వర్షమునకును, ఆపయి మానవజాతి మంగళము కొఱకును ఎట్లుతనజీవితము వినియోగించెనో వెనుకటిప్రకరణములయందు చూచియున్నాము. ఇదిగాక కురుక్షేత్రరణరంగమున శ్రీకృష్ణుఁడు పగ్గములు చేఁబూని అర్జునునకు సారథ్యమొనర్చుతరి ఆవీరాధి వీరున కుపదేశించిన గీతలు శ్రీకృష్ణుని మహాత్మ్యమును వేనోళ్ళ చాటఁగలవు.

అన్నిజాతులట్లు హిందూసంఘముకూడ వివిధావస్థలు దాటివచ్చినది. మానవజాతి బాల్యదశయందు ఎవరికి వారే జీవించుటకు యత్నించుచుండిరి. ఆనాఁడు జన్మకు పరమావధి ఇంద్రియ సుఖములనుభవించి విజృంభించుటయే యని భావించు చుండిరి. కాలక్రమమున వ్యక్తులు, యితరుల కొఱకు తాము జీవింపవలసిన ఆవశ్యకతను కనిపెట్టిరి. ఆనాఁటి స్వర్గసుఖములు కూడ ఇంద్రియానందమయములై యుండెను. తపోధనులు, మునులు, అధ్వరకర్తలు, దిగ్విజేతలుకూడ చచ్చిన తరువాత దేవేంద్రలోకమునకేగి రంభాసంభోగముపొంద నువ్విళులూరు

చుండిరి. మానవశరీరముతో నున్నంతకాలమును మంచినడవడి పొందియుండు టెల్ల అప్సరసల ఆలింగనమున కేయనియనవలసిన దే కద! ఇట్టియూహలచే బాహుబలసంపన్నులును, అతిమేధావంతు లును, ఇతరులను హింసపెట్టక సన్మార్గమున నడచుచుండిరి. యమధర్మరాజిడనున్న కఠినశిక్షలు మనుజుల వెఱపించి మంచి మార్గమున నుంచుచుండెను.

కాని మానవునినడతలను పాపపుణ్యముల క్రింద విభజించి నంతమాత్రమున మహాత్ములు కొందఱకు మనశ్శాంతి కలుగ కుండెను-చిత్రగుప్తుని చిఠాయందు మనపేరుననున్న పాపపుణ్య ములు (జమాఖర్చులు) సరిపడినంత నే మనము మరల మానవ జన్మమెత్తవలసివచ్చును. కావున మఱి జన్మలేనివిధాన మెయ్యది యని మహాబుద్ధిమంతు లాలోచింప మొదలిడిరి. అంతులేని ఆనందమునకు వారాసించి తత్ప్రాప్తికై ప్రయత్నింప మొద లిడిరి. ఆశ లఘుగంటనంతకాల మానందము ననుభవింపఁజాల మని వారునిశ్చయించుకొనిరి. ఎట్టి యానందమునాశింపనివాఁడే బ్రహ్మానందముఁ బడయఁగలఁడు, అట్టివానికి సుఖదుఃఖములతో నెట్టి ప్రసక్తియు నుండదు. భౌతికదేహ బాధలు వానిచెంతఁ జేరి ఆత్మాభివృద్ధికి నెట్టియాటంకమును కలిగింపలేవు. సుఖాభి లాషము, దుఃఖభయము, మనలను మానవ సంఘమును మిత్ర శత్రుకోటిక్రింద విభజింపఁ జేయుచున్నది. మహాత్ములగు వారికి అందఱునొకటిగ కాన్పింతురు. అందఱును దమలోనున్నట్లును, తామందఱిలో నున్నట్లును వారు భావించుచుందురు. చావులేని

అంతరాత్మ, నశింపనున్న దేహమును జయించినగదా అయ్యది అమరత్వమొందుననడగును! 'అమరగీత' యని చెప్పఁబడు భగవద్గీతల సారమిదియే. ఇయ్యవి శ్రీకృష్ణుఁడు అర్జునునకు బోధించినట్లు చెప్పుదురు—

భగవద్గీత యొక్కటియే శ్రీకృష్ణుని మహాత్మ్యగ నొసర్చుటకుఁ జాలియున్నది.

ఇయ్యది ప్రపంచమందలి పవిత్ర వేదాంతగ్రంథములలో నగ్రస్థానమాక్రమించుచున్నది. గీతాగ్రంథము పదునెనిమిదిఅధ్యాయముల క్రింద విభజింపఁబడియున్నది. అందు మొదటి ఆఱధ్యాయములును కర్మకాండ నభివర్ణించును. తఱువాత ఆఱధ్యాయములును భక్తిమార్గమును వ్యక్తీకరించును. శేషించిన ఆఱధ్యాయములయందును జ్ఞానమార్గము ప్రశంసింపఁబడినది.

శ్రీకృష్ణుని యనంతరము వేయి సంవత్సరములకు అవతరించిన బుద్ధదేవుఁడు మొదటి ఆఱధ్యాయములనే ఆధారముగఁ జేసుకొనినట్లు కాన్పించును. ఈతఁడుముఖ్యముగా నిష్కామకర్మనే బోధించెను. బుద్ధదేవుఁడు 'ధర్మమును పాటించి సంఘమును సేవించిన ప్రతిమనుజుఁడును నిర్వాణము వడయు' నని ప్రబోధించెను.

తరువాత నేతెంచిన లోకరక్షకుఁడు, అనగా ఏసుక్రీస్తు, భక్తిమార్గమునకెక్కుడు ప్రాముఖ్యతనీయఁదొడఁగెను. తనమతమును వ్యాప్తమొందించుట కేసుదేవుఁడు సాత్విక మార్గమునే యవలంబించెను. ఆనాఁటికి బుద్ధదేవుని అహింసామత ప్రభావ

మింకను ప్రజలహృదయముల వీడియుంపలేదు. ఇతఁడు 'భక్తిని ప్రధానము చేసుకొని సాధుకర్మావలంబనమున ముక్తిఁగాంచ నగు' ననెను.

మఱి ఐదువందల సంవత్సరముల కవతరించిన మహమ్మద్ అను మతబోధకుఁడు ఏసుదేవుని మతమే పాటించినను, క్షత్రియోచితములగు రాజసమార్గముల నద్దాని నన్నియెడల వ్యాప్త మొందింప మొదలిడెను. కావున నేఁడు ప్రపంచమందెక్కుడు ప్రజలచే అవలంబింపఁబడుచున్న మూఁడు ముఖ్యమతములును, అనగా బౌద్ధ, క్రీస్తు, మహమ్మదీయ మతములును, గీతాప్రయుక్త మతములే కాని వేఱుకానటులఁ గాన్పించును.

ఇంక హిందూమతమందు నానాఁటికిఁ బయలువెడలిన త్రిమతములఁ బరిశోధింతము. అద్వైత మతస్థాపనాచార్యుఁడగు శ్రీశంకరుఁడు గీతలలో చివరనున్న ఆఱధ్యాయములనే ముఖ్యముగాఁ గైకొనెను. జ్ఞానమునకు ముఖ్యస్థాన మొసంగి, కర్మను, భక్తిని అద్దాని కుపాంగములుగ నొనర్చెను.

రామానుజుఁడు భక్తిని ప్రధానముచేసికొని, జ్ఞాన కర్మములకు తరువాత స్థానమొసంగెను. దీనినే విశిష్టాద్వైత [illegible] యందురు.

ద్వైతమత ప్రబోధకుఁడైన మధ్వాచార్యులు కర్మ సోపానములపై భక్తిమార్గ మలవఱచికొనినచో ముక్తి సంపాదింపనగు ననెను. ఇట్లు త్రిమతాచార్యులును భగవద్గీతలనే

యాధారము చేసుకొని తమ తమ యభిమానమతముల వ్యాప్తి మొందించిరి. అంతయేల ? నిన్న మొన్న నన్ని మతముల నేకమొనర్ప నెత్నించిన బాలగంగాధరుడు, అరవిందఘోషు, గాంధీమహాత్ముడుకూడ తమ ప్రబోధనలకు గీతలనే యాధార మొనర్చుకొనియున్నారు. శ్రీకృష్ణప్రోక్తములగు గీతావచనములకు మించిన సుబోధనలు కాన్పింపవు. సర్వమతసారమగునట్టి గ్రంథమువచించినవ్యక్తి ఎట్టిమహాపురుషుడో చదువరులే యూహింతురుగాక. ప్రస్తుతమున్న రూపమున గీతలు శ్రీకృష్ణుని నోటినుండి వెలువడకుండ నుండిన నుండునుగాక, గాని యందలియభిప్రాయములుమాత్ర మాతని వనుటకు సందియ మణుమాత్రమైనను లేదు.

ప్రతివ్యక్తియు నొక్కొక్క సమయమున అనుకొనని నంతటి అత్యున్నతస్థితి కరిగి అద్భుతకార్యము లాచరించుచుండును. ఆశక్తియుక్తులు వ్యక్తుల నావరించియున్న అనుకూల పరిస్థితులననుసరించి యావిర్భవించును. వెఱ్ఱివారు, దయ్యముపట్టినవారు నిద్రోన్మత్తులు (Somnambulist) కొన్ని నమ్మరాని పనులాచరించుచుందురు. అటులే శ్రీకృష్ణునకు కురుక్షేత్రరణరంగమున దేవుడు పూనియుండనోపు. కాకున్న అర్జునుడు మరల సావకాశముగ గీతల తెలుసుకొనగోరి శ్రీకృష్ణునడిగినపుడు ఆతడు అసలుగీతల చెప్పలేక అనుగీతల నుడువుట ఎందుకు తటస్థించును! కావున శ్రీకృష్ణున కెక్కుడు భగవదంశ గీతలు నుడివినప్పుడే పొడమినట్లు కాన్పించును.

# నిర్వాణము

కురుపాండవ యుద్ధానంతరము శ్రీకృష్ణుఁడు ధర్మజు నార్యావర్తమున కభిషిక్తుంగావింప, నతఁడు పూజ్యంబగు రాజ్యంబు సేయుచు, వైదికస్మార్తాది గృహస్థధర్మము పాటించుచుండెను.

దేశము నట్టుడికించిన ప్రపీడించిన శిశుబాలహంతకులును, స్త్రీలోలురును, భైరవీపూజాధురంధరులును, అగు కంస నరక జరాసంధాది క్రూరవీరులందఱును సమసియుండుటను, దేశమెల్లఁ జల్లగ కాలము గడుపుచుండెను.

అన్యపరిభవ మెఱుంగని యదువీరులు ద్వారకా నగరమున మిన్ను మన్నులుగానక మిడిసిపాటునఁ ద్రుళ్లుచుండిరి. శ్రీకృష్ణునిజూడ నరుదెంచిన మునిపుంగవులతో వారు పరిహాసోక్తు లాడ మొదలిడిరి. వా రలిగి 'మీ రంతఃకలహములచే హతులగుదు' రని శపించిరి.

యతినిందాపరతను యదువంశము నాశనం బగునని శ్రీకృష్ణుఁడు నిశ్చయించి యాదవులను ప్రభాసతీర్థంబున కరుగుం డని యానతిచ్చెను. కాని యాదవులు మదిపానమత్తులై మత్సరంబునఁ దమలోఁదాము పోర నారంభించి యందఱును మడిసిరి. బలరామకృష్ణులు చింతాక్రాంతమనస్కులై ద్వారక వెడ వచ్చిరి. యోధుండగు బలరాముండట్టిదుస్థితి నున్న దేశంబున నుండనొల్లక యోగమార్గంబున దేహంబు విడిచి చనెను. బలరాముఁడే సరియైన యాదవవీరుఁడు. బ్రతికియున్నంతకాల మాతఁడొకరి లక్ష్యము లేక విచ్చలవిడి విహరించి, బ్రతుకు భారమని తోఁచినంతనే యద్దాని దృణప్రాయముగ విసర్జించెను.

హాలధరున కుండవలసిన అమాయకత్వమంతయు నాతనియందే మూర్తీభవించి యుండెను.

శ్రీకృష్ణుఁడన్ననో యట్టులుకాదు. యాదవుఁడు మాధవుఁడై అవతారంబుల నెత్తియుత్నించుటచే నాతనికి బ్రదుకుపై నాస యధికమయ్యెను. ఇది యాతని చరమకాలావస్థను బరిశీలించినచో సువ్యక్తమగును.

——శ్రీకృష్ణుండు చని చని, యొక్క నికుంజ పుంజంబు చాటున విశ్రమించుటంజేసి చరణంబు వేఱొక చరణంబుమీఁద సంఘటించి చంచలంబుగా వినోదంబు సలుపు సమయంబున, నొక్క లుబ్ధకుండు మృగయార్థంబుగావచ్చి దిక్కులు నిక్కి నిరీక్షించుచుండ, వృక్షంబుచాటున నప్పరమ పురుషుని చరణకమలంబు హరికర్ణంబు గాఁబోలునని దానింగని, శరంబు శరాసనంబునందు సంధానంబుసేసి, యేసిన, నతండు హా హా రవంబునం గదల మొదలిడెను.——

"కంసాది కుమతుల కసిమసంగినవాఁడు" ఒక్కలుబ్ధకునిచే కాలగతి నొందవలసి వచ్చెను! ఔరా, కాలమహిమ! అవసరముతీరిన పిదప అవతారపురుషులగతి యిట్లేయుండును.

మానవశరీరము ధరించియుండుటనుగావలయు శ్రీకృష్ణభగవానుఁడుకూడ, బాణనిహతుండైనయపుడు బాష్పంబులు విడుచుటయు, ఆహారావంబులొనర్చుటయుజరిగెను. కాని దెబ్బతిని నప్పుడుకన్న నుసురులు వీడునప్పు డాతఁడెక్కుడు సహనము చూపెను. మహాపరాధుండగు నా లుబ్ధకుండు బాష్పజలధారం

సిక్తవదనుండై కృష్ణుకడ కేతెంచిన నాతఁడు వానింగని క్షమించి ప్రాణంబులు విసర్జించెను. ఇంకను ఈతనికి ఇహలోకతాపత్రయ మడంగలేదు.

స్త్రీబాలవృద్ధ జనంబుల గరిపురంబునకుం గొనిపొమ్మని పాపకునకుఁ జెప్పెనట! కాని యింతలో ద్వారకా నగరంబు పరిప్లావితజలమయంబై మునింగెను.

కం॥ "ఏ దినమున వైకుంఠుఁడు
మేదినిపైఁ బాత్ప్రనట్టి మేఁకు విడిచి నా
డాదినమున నశుభప్రతి
పాదకమగు కలియుగంబు ప్రాప్తంబయ్యెన్॥"

శ్రీకృష్ణుండు తనకున్న శక్తిసామర్థ్యంబుల నెల్ల వినియోగించి కలియుగంబు రాకుండ కాపాడి యుంచెను. ఫణుల వర్తకవ్యాపారముల చేతను, (కాల) యవనుల దాడులవలనను, భరతవర్షమం దనేక నూతనాచార వ్యవహారములు చొరఁ జొచ్చెను. అందుచే ఆర్షమతమునకు విఘాతము కలుగనుండెను. కాని శ్రీకృష్ణునివంటి మహాపురుషుఁడు భూతభవిష్యద్వర్తమానముల బాగుఁగ గుర్తించి, వైదికాచారములఁ జాలవఱకు [illegible]చితముగ సంస్కరించి ప్రజలచే పాటింపఁజేసెను. ద్వాపరయుగాంతమునను, కలియుగారంభమునను, ఉన్న మహాత్ముఁడగుటచే, మత సాంఘిక ఆర్థిక రాజకీయ వ్యవస్థలయందు భావికలియుగమున భారతవర్షమింకొక జాతికి దాస్యమొనర్చు నవసరము గలుగకుండ కట్టుబాటులొనర్చియే చనెను. కావున

శ్రీకృష్ణుఁడు నూతనయుగకర్త యని చెప్పనగును. ఈతఁ డన్ని విధములఁ గలియుగమునకు కావలసినట్టి అవతారపురుషుఁడే. కలియుగ మీతని నిర్యాణానంతరము ప్రారంభమయ్యె ననుటలో నర్థమింతియే.

ముందుపరికరణమున శ్రీకృష్ణుఁడు కలియుగమునకు కావలసిన సంస్కారముల నెటుల నడపించి, ఆయుగమువారి కవతార పురుషుఁ డెట్లయ్యెనో చూచెదముగాక.

———

# ఉ ప సం హా ర ము

## శ్రీ కృ ష్ణుఁ డు

## (i)

### — యు గ క ర్త —

భారతవర్షమున పెక్కుమార్పులుగలుగు కాలమున శ్రీకృష్ణుఁ డుండెను. ఈతఁడు నూతనయుగకర్త కావుననే యీతని నిర్యాణానంతరము కలియుగము ప్రారంభమైనట్లు మనవారు చెప్పుదురు. ఇంద్రియానందమే ప్రధానోద్దేశముగఁ గల అసురసిద్ధాంతములను శ్రీకృష్ణుఁడు నాశనమొనర్చెను. ఆర్యు లభివృద్ధిఁజెందుచుండు సమయమున నష్టదిక్కుల కధికారులుగ నియమింపఁబడిన నాయకులు (దిక్పాలకులు), వారి అనుచరులు (దేవతలు), కూడ నిర్వీర్యులై పేరునకుమాత్రి మక్కడక్కడ మిగిలియుండిరి. వారిలో నధికబలవంతులైన ఇంద్ర వరుణదేవపదవులం దుండువారు శ్రీకృష్ణునిచే నోడింపఁ బడిరి. అనగా నాటుమార్గముల కధిపతియైన ఇంద్రుఁడును, నీటిమార్గముల కధిపతియైన వరుణుఁడును యాదవవీరుఁడైన కృష్ణునకు దాసులైరి. దేవతలకసాధ్యులైన దనుజులను (నరక, నివాతకవచులను) నరులయం దుద్భవించిన కృష్ణార్జునులు సంహరించి, సురులకు నరులేవిధమునను అల్పులుకా రని స్థిర పఱచిరి. అర్జునుఁడు దేవేంద్రునితో సమానముగా నాతని అర్ధాసనముపైఁ గూరుచుండెను. ఆనాఁటితో సురనరభేదము లంతరించినవనుట కింతకన్న ప్రబలనిదర్శనము లేమికావలయు?

నరనాయకులలోకూడ శ్రీకృష్ణుఁడు పెక్కుమార్పులఁ గావించెను. సనాతన ఆర్యకుటుంబములవారు మిశ్రమజాతుల ననాదరణదృష్టితోఁ జూచుచుండుటచే నార్యావర్తమున నైక మత్య మంతరించి యుండెను. ఆర్యావర్తాంతరభూములయం దుండిన ద్రవిడజాతులు ఆర్యసంప్రదాయముల నవలంబించి నను, వారి నార్యనాయకులు తమలోఁ జేర్చుకొనుటకు సందేహించుచుండిరి. అందుచే ప్రాగ్దక్షిణభాగములయందుండిన అసురవీరులు ద్రవిడుల తమపక్షమునకుఁ ద్రిప్పుకొని వైదికమత వ్యాప్తికి విఘాతము గలిగించుచేగాక, ఆర్యావర్తమును కూడ నాక్రమింప మొదలిడిరి. కావున ననేక సనాతన ఆర్యరాజకుటుంబములవారు వృష్ణినాయకుఁడగు వసుదేవుని తో వైవాహిక సంబంధములఁ గల్పించుకొని, జరాసంధాది అసురపక్షపాతుల వాతఁ బడకుండ తమతమ రాజ్యములఁ గాపాడుకొనుచుండిరి. అవసరము ననుసరించి ఆర్యులు అభీరులను, యాదవజాతులనుకూడ తమలోఁ గలుపుకొనవలసి వచ్చెను. యాదవాభివృద్ధికి ఆర్యులతో మైత్రియే శ్రేయో దాయకమని శ్రీకృష్ణుఁడుకూడ తండ్రిమార్గము ననుసరించి యసురసంహారణమునకును, అసురసంప్రదాయ నిర్మూలమున కును, బద్ధకంకణుఁ డయ్యెను. తండ్రివలె 'డొంకతిరుగుడు' మార్గముల నవలంబింపక ప్రత్యక్షవిరోధమూని శ్రీకృష్ణుఁడు కార్యముసాధింప ప్రారంభించెను.

పాశ్చాత్య దేశములతోడి వర్తకము తమసొత్తనిభావించు

చుండిన పణుల పసఁదూల్చి, శ్రీకృష్ణుఁ డావర్తక మాభీరుల కందఁజేసెను. వరుణదేవుఁ డోడిననాఁటినుండియు పణుల కార్యావర్తమున పలుకుబడితగ్గెను. ఈవణిగ్జాతులు పాశ్చాత్య ఖండముల యందే నిలచియుండి అచ్చో ప్రత్యేక సామ్రాజ్యముల నెలకొల్పి అభివృద్ధిఁగాంచిరి.* భారతవర్షమం దుండిన వణిజులు దక్షిణాపథమున కేతెంచి, అచ్చోనుండిన సనాతన ఆదిమజాతులతో వైవాహిక సంబంధంబులు గల్పించుకొని యభివృద్ధిఁగాంచఁ దొడంగిరి. ఈ సంబంధములవలననే కరణు లుద్భవించి, పన్నాటముగనుండిన దక్షిణాపథమును కాలక్రమమున కన్నాట మొనర్చిరి.

పణులను పారఁద్రోలి పశ్చిమోదధితీరంబుల నాక్రమించిన అభీరులు క్రమముగ కుశద్వీపమంతయు స్వాధీనమొనర్చుకొనిరి. అందుచేతనే యాద్వీపమునకు అభీరక (Africa) మను పేరు వచ్చినది. శ్రీకృష్ణుని నిర్యాణానంతర మార్యావర్తమున యాదవు లదృశ్యులైరి; కాని అభీరులుమాత్రము వివిధస్థలములనిలచి యభివృద్ధిఁగాంచినట్లు స్పష్టముగఁ గాన్పించును. గుప్తులస్థానమును (Egypt the land of Copts) కూడ గొల్లరాజు లేలినట్లు చరిత్ర చెప్పుచున్నది. ద్వారక అదృశ్యమైన తరువాత సారసేనము (Arabia) అభీరులకు ముఖ్యస్థానమయ్యెను. ప్రాచీన పాశ్చాత్య చరిత్రలయందు

* (Phoenicians, Cretans, Copts, Canaans and Carthaginians).

కాన్పించు హీబ్రూలు (Hebrews) మన శ్రీకృష్ణుని ఆద రణక్రింద నభివృద్ధిఁగాంచిన అభీరులే యనుటకు సందియము లేదు.

శ్రీకృష్ణుం డార్యులకుంగల యహంభావమడంచి వైదిక కర్మల నందఱిచేఁ జేయింపసాగెను దీర్ఘతమసుండను అంధక ఋషిని దమలో నుండనీయక గంగాజలంబులఁ బడఁద్రోసిన ఆర్యులు, ద్వాపరాంతమున శ్రీకృష్ణుని మహాత్మునిగ నంగీక రించిరి.

" మునులునృపులుఁ జూడ మును శర్మజాని సభా
మందిరమున యాగమండపమునఁ
జిత్రమహిమతోడఁ జెలువొంది, * * * "

శ్రీకృష్ణుఁడు అచ్చో నగ్రతాంబూలముఁ గైకొనెను. తాము తప్ప యితరు లాచరింపకూడదని ఆర్యులు వారించు వైదిక యజ్ఞములను, శ్రీకృష్ణుఁడు తనతండ్రియగు వసుదేవునిచేఁ జేయించెను.

తే॥ "మఱచి యజ్ఞాన కామ్యకర్మములఁ దిరుగు
వేదసాతురులకుఁ దన్నివృత్తిఁజేయ
* * * *
* నుదయించి తండ్రునిన్ గొందఱు * "

వైదికకర్మ లాచరింప నర్హులమని గర్వించుచుండిన బ్రాహ్మణులు తమ వనితలు శ్రీకృష్ణుని సందర్శించి,

భక్తిమార్గ మవలంబించి యానందపరవశు లగుటఁ గాంచి చిన్నఁబోయిరి. అందుచే వారు కర్మమార్గముకన్న భక్తి మార్గమే మనసున కెక్కుడు శాంతిఁజేకూర్చు నని తెలుసు కొనఁగలిగిరి. శ్రీకృష్ణుఁడర్థములేని యాగము లాచరించుట కన్న మానవసంఘమును సేవించుటచే మనసున కెక్కుడానం దమును శాంతియుఁజేకూరుననని బోధించెను. నాఁటినుండియే భక్తిప్రధానమైన భాగవతమతమున కార్యావర్తమున నెక్కుడు ప్రాముఖ్యత వచ్చెను.

కర్మమార్గము వెనుకఁబడుటచే బ్రాహ్మణుల ప్రాముఖ్య తయు, అహంభావమును అంతరించెను; అన్నితరగతులవారికి నార్షమతముపై నభిమానము హెచ్చెను. అందుచే హిందూ సంఘమునకు నాఁటినుండియు నెక్కు డౌన్నత్యము గలిగెను.

———

## శ్రీకృష్ణుఁడు

## ( ii )

### — మహాత్ముఁడు —

ఉ॥ "ఉత్తమకీర్తులైన మనుజోత్తము లాత్మ హితంబు లెన్నడుం
జిత్తములందుఁ గోరరు హసించియు లోకులకెల్ల నర్థ సం
పత్తియు భూతియున్ సుఖము భద్రముఁ గోరుదురు *
* * * * ".

ఉద్దేశము లెట్టులున్నను ఫలములఁబట్టి వ్యక్తులు ప్రఖ్యాతిఁ గాంచుచుందురు. వృష్ణివంశీయుఁడైన కృష్ణుఁడు తన తండ్రివిరోధుల నిర్జింప మొదలుపెట్టి, మహాబలశాలియగు మాగధునితో కయ్యమునకుంగడంగి, ఆతనితోఁబోరలేక అభీరుల (నారాయణ గోపాలుర) తన చెంతఁజేర్చుకొని అఖిలయాదవలోకము నేకమొనర్ప నెత్నించి, కయ్యము లధికమైనకొలంది నెయ్యములం బెంచి, భారతవర్షమందలి రాజకుటుంబములతో సంబంధములుకల్పించుకొననవసరపడి, తుదకు మహాభారత రాజకీయనాట్యరంగమునఁ గూడ ననవసరసంపర్కము కలిగించుకొని, అనుకొనని జగత్కల్యాణకర్త కావలసివచ్చెను.

కాని తనవిహితధర్మము లెఱింగిన కొలందిని తదనుగుణమగు శక్తియుక్తులతో వాటిని సమర్థింప సాహసించిన వ్యక్తి మహాపురుషుఁ డనక తప్పదు. శ్రీకృష్ణుఁడు కేవల

స్వార్థపరుండుగాక యింకొకరిఁగూర్చి పాటుపడుటచే మహా
త్ముఁడుకూడ నయ్యెను. బలదేవుఁడు తనకుఁగల ప్రఖ్యాతి
నంతయు తన పశుబలముతోడనే యార్జించియుండెను. అందు
చేతనే పశుబలప్రియుఁడగు దుర్యోధనుఁడు హలరాముని
ప్రియశిష్యుఁడని చెప్పఁబడుచున్నాఁడు. శ్రీకృష్ణుఁ డట్లుగాక
బుద్ధిబలముచేత సాధారణముగ నన్నికార్యములను సాధింపఁ
జూచుచుండెను. కావుననేకావలయు మనవారు శ్రీకృష్ణుఁడు
మూర్తీభవించినబుద్ధి అనికూడ వాడుదురు. *

కేవలముబుద్ధిప్రభావముచేతనే వేలకొలఁది వత్సరముల
పిమ్మటఁ దనజన్మభూమికిన్నీ, అభిమానమతమగు నార్షమతము

---

* శ్రీజగన్నాథక్షేత్రమందు కలియుగనారాయణుఁడని పూజింపఁబడుచున్న
బౌద్ధావతారవిగ్రహమును వీక్షింప నందుకరచరణాదులు కాన్పిం
పవు. విగ్రహమంతయు ముఖముతోడనే నిండియున్నది. బుద్ధికి
స్థానమైన శిరస్సు ఆవిగ్రహమందు ముప్పాతిక మువ్వీసము
లాక్రమించియుండును. పశుబలప్రయుక్తంబున కనువగు నవ
యవముల (కాలుచేతుల) కందు చోటులేదు. కలియుగంబున
మనఁదలచుకొనిన ప్రజలకు పశుబలముకన్న బుద్ధిబలమే ఎక్కు
డుండవలె నని ఆవిగ్రహము స్పష్టీకరించును. కలియుగప్రారంభ
మున నవతరించిన మహాపురుషుండగు శ్రీకృష్ణుని జీవితముకూడ
దీనినే విశదీకరించుచున్నది. మహాపురుషులను మనవా రిటులనే
అవతారము లొనర్చినట్టుల కాన్పించును.

నకును రాఁగల ముప్పుల నెఱింగి, కావలసిన కట్టుబాటు లొనర్చియె చనియెను. వివిధజాతులవా రేతెంచి ఆర్యావర్త పుణ్యభూమి నల్లకల్లోల మొనర్చి ఆర్షమతమునకు విఘాతము కలియుగంబున గలిగింప యత్నింతు రని శ్రీకృష్ణుఁ డెఱింగి యుండుటచేత నే సర్వమతములకును సమాధాన మియ్యఁగల గ్రంథమును కూడ నుడివి చనెను. మాటలతో మార్గము సూచించు మహాత్ముఁడే గాక, నడవడిచేత కూడ నందఱకు నాదర్శప్రాయుఁడై అస్తమించిన మహాపురుషుఁడు శ్రీకృష్ణుఁడు.

శ్రీకృష్ణుఁడు తనబుద్ధిచేత నే కదా పూతనాది రాక్షసుల నంత మొందించెను. ఆసన్నమరణభీతిచే మతిచెడియున్న కంసుని కీలెఱిఁగి ఆతనిఁ గాలుపీఁటి కంపెను. అబలను ఆహావమునకు నెదురుగ నిలువఁబెట్టి, నరకుని మదికలఁగఁజేసి, ఆతనిఁ గడతేర్చెను. కాలయవనుని కాల్నడకను ఏకాకిగ మధుర నుండి ముచికుందుఁ డుండిన బిలముకడకు కొనివచ్చినదేది ? శ్రీకృష్ణుని బుద్ధిబలమేకదా! మార్గాయాసమున గ్రుగ్గియున్న యాతనిని, నిలుకడగ నింటకూర్చొనియున్న ముచికుందునిచే నంత మొందించెను. భీమునిచే జరాసంధుని గ్రమ్మించుట యందు శ్రీకృష్ణునిచమత్కార మెంతయుఁగాన్పించును. కౌరవాధీశునికారాగారమున తా బంధీకృతుఁడుగాకుండ, తన వాక్నైపుణిఁజూపి, యటనుండి దాటుకొనివచ్చినవ్యక్తి బుద్ధివిభవమున కేమనవలెను ! యుద్ధదినములలో భీష్మునికడకు ధర్మజునంపి, ఆ వీరాధివీరుని మరణ మర్మమెఱుంగుటయు, అశ్వత్థామ హతుఁ

డయ్యెనని ధర్మజుచేఁబలికించి ద్రోణునిచే నస్త్రసన్న్యాసము చేయించుటయు, నిట్లనేకకృత్యంబుల శ్రీకృష్ణునిబుద్ధికాదే పాండవేయుల పురుషార్థంబులకు మూలంబయ్యెను. యాదవులు శాపోపహతులైనప్పుడు శ్రీకృష్ణుఁడసమర్థతచే నూరకుండలేదు. వ్యసనాసక్తులై లోకకంటకులుగ నుండిన యాదవుల వినాశన మపేక్షించియే ఆతఁడుపేక్షించి యుండెను.

"సీ. ఈరీతి శ్రీకృష్ణుఁ డేపారఁ బూతనా
శకట తృణావర్త సాల్వ వత్స
చాణూర ముష్టిక ధేను ప్రలంబక
చైద్యాఘ శిశుపాల దంతవక్త్ర
కంస పౌండ్రాదిక ఖండనం బొనరించి
యటమీఁదఁ గురుబలంబణఁచి మఱియు
ధర్మజు నభిషిక్తుఁ దనరఁగాఁ జేసిన
నతఁడు భూపాలనం బమరఁజేసె;

తే. భక్తులగు యాదవేంద్రులఁ బరగఁ జూచి
'యన్యపరిభవ మెఱుఁగరీ యదువు' లనుచు
వీరిఁబరిమార్ప నేఁ దక్క వేఱొకండు
దైవ మిఁక లేదు త్రిభువనాంతరమునందు."

అని నిశ్చయించుకొని కృష్ణుఁడు యాదవుల కన్యోన్య వైరానుబంధంబులంగల్పించి, వారల హతంబుగావించి భూభారంబడంపనెంచుటచే శాపదగ్ధులైనయాదవుల నుద్ధరింపక యూరకుండెను.

---

# శ్రీ కృష్ణుఁడు

## ( iii )

### — సామ్రాజ్యస్థాపనాచార్యుఁడు —

నరులలో జన్మించిన నహుషుఁడు నూరు యజ్ఞములు చేసి దేవసముఁడై తుదకు దేవేంద్రపదవిఁగూడ కొంత కాల మనుభవించెను. ఆతని వంశమందు పుట్టిన యయాతిమహారాజు మహావైభవముతో భూమండలం బేలి ఆనాఁటి యసుర వీరులనుగూడ నడిమియుంచెను. ఈతఁడు తన యఖండసామ్రాజ్యమున నలుదిక్కుల కన్నసుతులనే కావలి యుంచియుండెను. కాని కొన్ని కారణములచే పెద్దవాఁడగు యదువునకు సార్వభౌమత్వమీయక కనిష్ఠుండగు పురు వనువాని కయ్యదియొసంగెను. యదు తన పుత్రమిత్రానుచర గణంబుతోఁ బాశ్చాత్య భాగంబులకు వలసపోయి అచ్చో తన స్వతంత్రతఁ గాపాడుకొని యుండెను. కొంత కాలమైన తరువాత సీతని వంశీయులైన హైహయులు భారతవర్షమున కేతెంచి ఆర్యావర్త పుణ్య భూమి కంటియున్న నర్మదానదీతీరంబున నొక్కపురంబు నిర్మించుకొని యందుండి యభివృద్ధిఁగాంచుచుండిరి. కార్తవీర్యుని బాహుబల సంపత్తులచే యదువంశీయులు దక్షిణాపథమును ఏకఛత్రాధిపత్యముగ నేలఁ దొడఁగిరి. సిరిసంపత్తు లధికమైన తరువాత పతిత క్షత్రియులే పావనులై తమయింటి పడుచుల వైదిక శిష్టాచార పారీణులగు బ్రాహ్మణోత్తములకుఁగూడ

నియ్య మొదలిడిరి. కొంత కాలమైనతరువాత నధికారమదాంధత హైహయులచే ననేక దుష్టకార్యము లాచరింపఁజేసెను. తపోనిష్ఠాగరిష్ఠులగు బ్రాహ్మణోత్తములఁ దృణీకరించుటచే, వారలిగి హైహయరాజ్యమేగాక ఆర్యావర్తమందలి సనాతన రాజ్యములంగూడ కూకటి వేళ్ళతో విధ్వంస మొనర్చిరి.

కం॥ "భూపాలకులకు విప్రులఁ
గోపింపం జేయఁ దగదు కోపించినఁ ద
త్కోపానలంబు మొదలికి
భూపాలాటవులఁ గాల్చు భూకంపముగాన్" ॥

కార్తవీర్యుని అనంతరము యదువంశీయులు కొంత కాల మార్యావర్తమున నామమాత్రావశిష్టులై యుండిరి. మాధవుఁడు ఉత్తరాపథమందును, ముచికుందాదులు దక్షిణాపథమునను, చిన్న చిన్న రాజ్యముల నెలకొల్పుకొని మనుచుండిరి. వసుదేవుని నాఁటికి యాదవుల పలుకుబడి మఱల నార్యావర్తమున నధికము కాఁదొడంగెను. కాని కంసుని దుండగములచే యాదవులయం దైకమత్య మంతరింప వారందఱు నానాదేశంబుల కేగిరి. ముచికుందునిన్నిద్రాసక్తియు, కుండినగరంబునందుండిన భీష్మకుని వైరాగ్యమును, కంసుని క్రౌర్యమును, యాదవుల నెల్లెడల నిరుత్సాహులఁజేసెను. తనయాదవులదుస్థితిఁ గాంచి శ్రీకృష్ణుఁడు ముందంజవేసి కంసుంగడదేర్చి, ముచికుందుని మేల్కొల్పి, భీష్మకుని పుత్రికను పరిణయమై యాదవుల యందైకమత్యము నెలకొల్పెను.

కంసవధానంతరము శ్రీకృష్ణుఁడు జరాసంధునితో నిరంతరయుద్ధనిమగ్నుఁడయ్యెను. అరక్షితంబగు మధురానగరంబు యాదవుల సంరక్షణమున కనువుకాకుండెను. అందుచే శ్రీకృష్ణుఁడు యాదవరాజధాని నింకొక నూతన నగరంబునకు మార్చవలసివచ్చెను. ఈతనియనుచరులందు అభీరులెక్కుడుఁగ నుండుట చేతను, వారికి నీటిపై నెక్కుడు బలముండుటంబట్టి యు శ్రీకృష్ణుఁడు తన నూతన నగరము నీటఁగట్టెను. మహోదధీ తీరంబుల నదిమియుంచుటకు మహేంద్రంబు ప్రాచీభాగంబున నట్టులుండెనో, పశ్చమోదధీ తీరంబుల నెల్ల నేలుటకు రైవతకాద్రియు పశ్చమ తీరంబున నట్టులుండెను. అందుచేత నే శ్రీకృష్ణుఁడు తత్పర్వతప్రాంతమందుండిన ద్వీపంబుపై ద్వారకా నగరంబునిర్మించి యాదవుల నిర్విక్రపరాక్రమోపేతులఁ జేసెను. మున్ను కార్తవీర్యుఁడుండిన మాహిష్మతీ నగరంబుకూడ నా పరిసరంబులనే వర్ధిలి యుండెను.

ఆర్యులు నాఁటుదారులఁ (land routes) బట్టి నలుగడల వ్యాపింపఁ జూచునప్పుడు హస్తినా నగరము, మధుర, గిరివ్రజము వంటి భూమధ్యనగరములు రాజధానులుగ నుండుటకువీలయ్యెను. కాని పణులపర్యటనలచే నేఁడార్యులఅధికారము సముద్రాంతరభూములకుఁగూడ నీటిమార్గముఁబట్టి వ్యాపింపఁ జొచ్చెను- శ్రీకృష్ణుని నాఁటికి ఆర్యుల స్థానము భారవాహాజలసంధి (Bherring Straits) మొదలు బ్రిహస్థానము (Britain) వఱకున్న స్థలజల భాగంబుల నావరించి యుండెను-

ఆ ప్రపంచమునకు ద్వారకయే అన్నిట ననువైన కేంద్ర స్థానము. ఇటనుండిన వీరు లానాఁటి ప్రపంచమందలి నాటు, నీటి మార్గములన్నిఁ నేకరీతి స్వాధీనమందుంచుకొనఁ జాలియుందురని ఎఱింగియే శ్రీకృష్ణుండద్దానిని యాదవులకు రాజధానిగ నెన్నుకొనెను.

మనుజులకుఁ దెలిసిన ప్రపంచపరిమితి అధికమైనకొలఁది ప్రపంచముయొక్క కేంద్రస్థానముకూడ మారుచుండును. రామునినాఁడు అయోధ్య కేంద్రముగనుండెను. శ్రీకృష్ణుని నాఁడు ద్వారక కేంద్రస్థానము కావలసివచ్చెను-కొంత కాలము తరువాత ఈగుప్త (Egypt) ఆనాఁటి ప్రపంచమునకు కేంద్ర స్థానమయ్యెను. కొలంబస్ (Colombus) పర్యటనంచే నేఁడు బ్రిటిష్ దీవులు ప్రపంచమునకు కేంద్రమాగనున్నవి. అమెరికా ఖండ మభివృద్ధిఁజెందుచున్నదిగావున కొలదికాలములో జపాన్ దీవులో హ్యాండురాస్ (Honduros) దీవులో కేంద్రస్థానము లగును.

నైల్ నదీ ముఖద్వారమందు అలగ్జాండర్ నిర్మించిన మహానగరము (Alexandria) ప్రాపంచకవర్తకమునకు కేంద్ర స్థానమై విఖ్యాతిఁ గాంచుచెల్లి ఆవీరాధివీరు బుద్ధివిభవమును వెల్లడించునట్లు, ద్వారకా నగర మభివృద్ధిఁగాంచి, ఆభీరు లన్నియెడల విజృంభించుట కనువౌనంగుట యెల్ల శ్రీకృష్ణుని సామ్రాజ్య నిర్మాణకౌశలంబును వ్యక్తీకరించును. ఉత్తర దక్షిణాపథంబులఁ జెదరియున్న యాదవుల నవసరపడినప్పుడెల్ల

ఆ నూతన నగరము నొక్కచోఁ జేర్చుటకు ద్వారక యెంతయో యనుకూలముగ నుండెను; అందుచే నాఁటినుండి యాదవు లపజయంబన్న నెట్టిదో యెఱుంగక నచ్చో మనఁ గలిగిరి. నీటఁగట్టఁబడిన ద్వారకానగరము,యాదవుల ఆదరమున నభివృద్ధిఁజెందిన అభీరుల కనిర్వచనీయమైన సౌకర్యములఁ జేకూర్చి, పశ్చిమోదధియంతయు వారి సొత్తొనర్చెను. కావు ననే నాఁటినుండి నా సంద్రమును, ఆర్యు లాభీరసముద్ర మని పిలువఁ జొచ్చిరి.

పాశ్చాత్య దేశంబులఁ కెక్కు మొగంబయి యుండిన ఆనూతన నగర మచ్చటిసంపత్తులనెల్ల నార్యావర్తమునకుఁ గొనివచ్చుటకుఁ దగిన ద్వారముగ నుండుటచేత నే కావలయు నద్దానికి ద్వారకా యనునామంబు సార్థకంబయ్యెను. నేఁటికిని పాశ్చాత్య దేశంబులతో ప్రధానముగ వర్తకమొనర్చుచున్న పట్టణములు (Karachi, Broach, Surat, Diu, Bombay) శ్రీకృష్ణుని ద్వారక పరిసరంబులనే యుండుటఁజూడ ఆ మహాపురుషుని ప్రజ్ఞాదికములపట్ల మనకింకను గౌరవ మధికము కాఁగలదు.

శ్రీకృష్ణుఁడెంత ప్రయత్నించినను యాదవులు తమ్మావరించియున్న దుర్గుణంబుల వీడకుండుటచే నాతనికి వారిపట్ల శంక లుత్పన్నమయ్యెను-శమంతకమణి కాన్పింపనప్పుడు, సుభద్ర నర్జునునకిచ్చు నవసరమున, శశిరేఖా వివాహ సందర్భముననను, మదిరపానామత్తులై యాదవులు ప్రభాత తీర్థమందు స్త్రీలతో విచ్చలవిడి విహరించుపట్టునను, బలరాముఁడు రుక్మితోఁ జూద

మాడిస్వల్పకారణమునఁగుపితుఁడై, ఒక్కవేళ్టుననాతనిఁజంపు తఱిని, యాదవులపట్ల శ్రీకృష్ణుఁడు నిరుత్సాహుఁడయ్యెను. కావుననే నాఁటినుండియు నాతఁడు పాండవుల నార్యావర్తసార్వభౌములుగఁజేయ నెక్కుడుగ యత్నింపవలసి వచ్చెను. ఉగ్రసేను ననంతరము, యాదవసామ్రాజ్యమునకు, సర్వసద్గుణసంపన్నుఁడైనను ఆహవముల యందంతగ ననుభవములేని యక్రూరుని బట్టభద్రునిగనొనర్చుటయందే శ్రీకృష్ణుఁడు యాదవులసామ్రాజ్యాభివృద్ధి నంతతోనాపెనని నిశ్చయముగ నెఱుంగ నగును.

పాండవులకు రావలసిన రాజ్యభాగ మిప్పించి వారలన్నవస్త్రములకు దూరులు కాకుండ మున్ను చూచుచుండిన శ్రీకృష్ణుఁడు, అటుతరువాత పాండవదూతగను, పార్థసారథిగను కూడ నుండుట కంగీకరించుటయెల్ల, తనకు నచ్చినవారు సార్వభౌమ పీఠంబున నుండుట కిచ్చగించియేకదా. యాదవుల దుష్కృత్యంబులచే, శ్రీకృష్ణుని యాదవసామ్రాజ్యప్రతిష్ఠాపనము పొసఁగకున్నను ఆతఁడు పాండవులఁబట్టి, వారలనుద్ధరించి అఖిలభారత సామ్రాజ్యస్థాపన కార్యము నెఱవేర్చుకొనెను.

వరుణదేవుఁ డేలుచుండిన సామ్రాజ్యము(Sea Empire) నకు అక్రూరుని బట్టముగట్టి, పాకశాసనుని పాలనంబందుండిన స్వారాజ్యమును (Land Power) పాండవేయులకందఁజేసెను. జగత్కల్యాణమునకు కావలసినది పాలకుని సద్వర్తనమేగాని పుట్టు పూర్వోత్తరంబులు గావని శ్రీకృష్ణుఁడు స్పష్టీకరించెను.

ఆధునికకవి యొకఁడా మహాత్ముఁ డొనర్చిన సంస్కరణముల నిట్లభివర్ణించి యున్నాఁడు.

సీ॥ మాలఁబట్టించెగా పూజలు మాన్పించి
నిరుపయోగులటంచు నిష్ఠకులను;
మించి బోధించెగా మేదినీసురలను
గోసంపతుల భక్తిఁ గొల్వఁ జెనుచు;
మాన్పించె నాఁడుగా మహిమలేవని జెప్పి
రహి క్షుద్ర దేవతారాధనముల;
సవరణఁ జేసెనుగదా 'జన్మతోడనె రాజు'
ననియెడు నాచారమును గడంగి;
పుట్టువనుగల్గు సత్వమ్ముగట్టి పసుల,
బుద్ధియింతయేనియున్ బొనరకున్న;
ననుచు నూహించి దేవకీతనయుఁ డవని
పాండుతనయుల కొనఁగూర్చెఁ బ్రాభవమున ॥

## శ్రీ కృష్ణుఁడు.

## ( iv )

## మతస్థాపకుఁడు.

తమచుట్టునుండిన ప్రజలదుస్థితిని జూచి సహింపలేక యుదారస్వభావులగు మహాపురుషులు వారి నుద్ధరించుటకు ప్రయత్నింతురు. పరులబాధలు తమవిగభావించి సంఘసంస్కరణకుఁ బూనుకొందురు. ఈసంఘసంస్కర్తలే కాలక్రమమున తమజాతికి నాయకు లగుదురు (Tribal heroes). వీరు తమ జాత్యభివృద్ధికి అవలంబించిన మార్గముల నితరజాతి ప్రజలు కూడ నామోదించినంతనే వీరు మానవసంఘముచే మహాత్ము లుగను, అవతారపురుషులుగను ఎన్నబడుదురు. జూదుల (యూదుల-Jews) దుస్థితిచూచి సహింపలేక వారల నుద్ధరింప నెత్నించి ఏసుక్రీస్తు మహాత్ముఁ డయ్యెను. రోమకుల పాలన మున సకలసద్గుణములఁ గోల్పోయి పశుప్రాయులుగఁ బ్రవ ర్తించుచున్న యూదులకు స్వర్గరాజ్యరాజమార్గముఁ జూపిన మహాపురుషుఁడే, నేఁడు మానవకోటిచే నీశ్వరపుత్త్రుఁడుగనారా ధింపబడుచున్నాఁడు. మహమ్మదు పుట్టిననాఁడు అరేబియా స్థితికూడ మిగుల నిర్భాగ్యదశయందుండెను. ప్రజలలో నైకమత్యము లేకుండెను. శాఖకొక దేవుఁడు, గ్రామమున కొకదేవత, వీథికొక దేవాలయము, ఇంటికొక ఈశ్వరుఁ డగు టచే నెవరికివారే తాఁబట్టిన కుందేటికి మూడేకాళ్ళనుచుండిరి.

అంతఃకలహములచే నరబ్బులు నిరంతరదారిద్ర్యమును, దాస్య మును అనుభవించుచుండిరి. మహమ్మదు తనవారినుద్ధరింపనెంచి యెంతయో కాల మాలోచించి యాకారశూన్యమైన ఏకేశ్వ రోపాసనము బోధింపఁ జొచ్చెను. ఆకాలమున నరేబియాదేశ మందున్న వివిధమతములను, వివిధదేవతలను ఖండించి అందఱి కనువగు నొకమతమును నెలకొలిపెను. అన్ని దేవళములను విధ్వంస మొనర్చి మక్కాపట్టణమం దాదినుండియు ననేకులచే నారాధింపబడుచుండిన 'కాబా' యను ఈశ్వరదేవళము నొక్కదానినే మిగిల్చెను. చాలాకాల మాతఁడు తనజాతి వారుపెట్టిన బాధల ననుభవించెను. కాని తుదకు జయముఁ గాంచెను. ఆయరబ్బులనాయకుఁడు నేఁడు లోకులచే నిజమైన దేవదూత (The only true Prophet) అని కొనియాడఁ బడుచున్నాఁడు.

శ్రీకృష్ణుఁ డవతరించుటకుఁబూర్వము హిందూసంఘము కూడ మిక్కిలి దుస్థితియందు డుండెను.

కం|| "జననము నైశ్వర్యంబును,
ధనమును విద్యయును గల మదచ్ఛన్నుల కిం
చనగోచరుఁడగు నిన్నున్
వినుతింపఁగ లేరు నిఖిల విభుసంస్తుత్యా". (భాగ. ప్రథ 190)

కంసునివంటి బాలఘాతుకులును, నరకునివంటి నారీజన మానాపహారులును, జరాసంధునివంటి వైరవార్ఛకులును

ఇంద్రియానందమే జన్మకుపరమావధి యనిభావించి, మానవ సంఘమునకు మహాపదలఁజేకూర్చుచున్న అసురవృత్తులు భారతవర్షమం దంతటను చెలరేగియుండిరి. జైమినిచేబోధింపఁ బడిన కర్మప్రధానమగు పూర్వమీమాంసమతము మూలఁబట్టి యుండెను. అట్టిసమయమున శ్రీకృష్ణుఁడు 'జ్ఞానప్రధానమైన భక్తిమార్గమవలంబించిన ముక్తిఁబడయుదు' రని బోధించెను. నాఁటినుండియు నార్యావర్త మనన్యసామాన్యమైన దివ్యకళలతో వెలుగొందు, అఖిలదేశంబులకు నాదర్శప్రాయమయ్యెను. ఆనాఁడు సర్వభద్రసంయోజకుఁడైన శ్రీకృష్ణుఁ డొనర్చిన సంస్కారణములే, ఈనాఁటికిని ఆర్షమతమును, హిందూసంఘమునుకూడ నశింపకుండ కాపాడుచున్నవి. అందుచేతనే మనవారు కొందఱతని 'శ్రీకృష్ణభగవానుఁ', డనుచున్నారు.

శ్రీకృష్ణుని ధైర్యసాహసములు, సమయస్ఫూర్తి, విశాలవీక్షణము, కార్యదీక్ష, దేశభక్తి, సర్వసమత్వము చక్కఁగ గుర్తెఱింగిన, నీతఁడు మహాపురుషుఁడేగాక మహాత్ముఁ డనికూడ స్పష్టపడును.

శ్రీకృష్ణుని ఆదర్శజీవనమును మహర్షి పోతన:

శా॥ "శ్రీకృష్ణా యదుభూషణా నరసఖా శృంగారరత్నాకరా
లోకద్రోహినరేంద్రవంశదహనా లోకేశ్వరా దేవతా
నీక బ్రాహ్మణ గోగణార్తిహరణా నిర్వాణసంధాయకా
* * * * * "

అని చక్కఁగ కుంతిచే ననిపించెను.

శ్రీకృష్ణుఁడట్టి కార్యముసేయఁ [illegible]నను పరమోత్సా-
హంబుతో నద్దాని నాచరించుచుండుట చే[illegible]
వెన్నఁడెఱుంగఁడయ్యె. భీష్మునంతటివాఁడు:

మ॥ "తనకున్ భృత్యుఁడు వీనిఁగా చుట మహాధర్మంబు వో మ్మంచు న
ర్జున సారథ్యము పూని పగ్గములు చేఁ జోద్యంబుగాఁ బట్టుచున్
మునికోలన్ నశిఁ బూన్చి ఘోటకములన్ మోదించి తాడించుచున్
జనులన్ మోహమునొందఁజేయు పరమోత్సాహుం బ్రశంసించెదన్"

అని శ్రీకృష్ణుని స్తుతించుచు, నీతని యుత్సాహమునే యెక్కుడుగఁ గొనియాడెను.

కావున నర్జునుఁడు తలంచినట్లు మనముకూడ శ్రీకృష్ణుని:—

"మనసారథి మనసచివుఁడు
మనవియ్యము మనసఖుండు మనబాంధవుఁడున్
మనవిభుఁడు గురుఁడు దేవర
* * * * * "

అని భావించి, యాతనిచర్యలఁ జర్చించి ధ్యానించినచో నా పురుషోత్తముని ఉత్తమగుణములు కొంతవఱకు మనలకలవడ, నన్నిటను మనముకూడ విజ[illegible]

# కళాప్రచారక సమితి ప్రచురములు

## బ రం పు ర ము.

### రా య బా ర ము:

1. మొదటిసంపుటము:—సంజయురాయబారము రూ. 1/-
2. రెండవసంపుటము:—శ్రీకృష్ణరాయబారము రూ. 1/-
3. కర్ణచరిత్ర:—(పూర్వ ఖండము) రూ. 0-10-0

   నూతన మార్గమున రచియింపబడిన ప్రబంధము.

   (ఉత్తరఖండము ముద్రణమున నున్నది.)
4. శ్రీకృష్ణుడు:—పరిశోధకచరిత్ర.

### అను బం ధ ము లు.

1. పాలవెల్లి:—తత్త్వకవిత్వము—పద్యకావ్యము 0-8-0
2. తేనెపట్టు:—భావకవిత్వము—పద్యకావ్యము 0-8-0

### రా బో వు గ్రం థ ము:—

రాబోవు గ్రంథనామములదెలిపినచో, గ్రంథనామచోరులు అను క్రొత్తరకపు దొంగలు బయల్వెడలి ఆ గ్రంథము తమదేయని అన్యాయ విఖ్యాతినొందుటయు, తన్నామబలమున అక్రమధనార్జన సేయుచు పాఠకలోకమును మోసగింతురనియు, రాయబారమను గ్రంథప్రచుర సందర్భమున సంపూర్ణముగ నెఱిగిన వారమగుటను, రాబోవు గ్రంథనామముల మున్ముందుగ దెలుప సాహసింపమికి మము సహృదయులు మన్నింతురుగాక !

దేవరాజు వేంకట కృష్ణారావు,

కార్యదర్శి.

డాక్టరు చిలుకూరి నారాయణరావుగారి గ్రంథములు.

---

| | | |
|---|---|---|
| సంస్కృత లోకోక్తులు | ... | రు. 1-0-0 |
| అశోకుని ధర్మశాసనములు | ... | 2-0-0 |
| జర్మనీదేశవిద్యావిధానము | ... | 1-0-0 |
| ఉపనిషత్తులు | ... | 0-6-0 |
| పిల్లల పాటలు | ... | 0-2-0 |
| అంబ (మొండి శిఖండి) | ... | 1-0-0 |
| అశ్వత్థామ—అచ్చి (రూపకద్వయి) | ... | 0-12-0 |

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారివి:—

| | | |
|---|---|---|
| వీరపూజ | ... | 1 0-0 |
| అనాథ బాలిక | ... | 0-10-0 |
| స్మశానవాటిక | ... | 1-0-0 |
| రక్షాబంధనము | ... | 1-8-0 |

వ. రా:--పోస్టేజీలు ప్రత్యేకము.

D. V. KRISHNARAO, *Propr...r* V.J.P. Works, BERHAMPUR(G)